# ఇప్పుడు పిడిలైట్ అందిస్తోంది వాటర్ కలర్స్ కూడా

పిడిలైట్ ®

# ఫెవిక్రిల్



## పిక్సీ ప్యాక్

వేయడానికి సులభం, వినోదానికి వినోదం

A PIDILITE PRODUCT

everest/92/PIL/127-tl







kores
WATER COLOURS




kores




kores




kores






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి





## ఉదాత్తమైన వృత్తి!

బ్రిటన్‌లోనూ వేల్స్‌లోనూ గత జూన్ మాసం 7వ తేదీ జరుగుతాయనుకున్న పరీక్షలకు 6,00,000 మంది విద్యార్థులు హాజరు కాలేకపోయారు. అందుకు కారణం, మూడు యూనియన్లకు చెందిన ఉపాధ్యాయులు పరీక్షలను బహిష్కరించడం!

పధ్నాలుగేళ్ళు నిండిన విద్యార్థినీ విద్యార్థులకు — విశ్వవిద్యాలయాలకు వెళ్ళడానికి రెండేళ్ళ ముందు, ఈ పరీక్షలు పెట్టాలని బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. విద్యార్థులు తమ భవిష్యత్తును నిర్ణయించుకోవడానికి అంటే, ఉన్నత విద్యను అభ్యసించడమా లేక వృత్తివిద్యలను నేర్చుకోవడమా అన్న విషయాన్ని నిర్ణయించడానికి ఈ పరీక్షా ఫలితాలు ఉపయోగపడతాయని ప్రభుత్వం భావించింది. దీని ద్వారా విద్యార్థులకే కాకుండా, పాఠశాలలకూ, కళాశాలలకూ కూడా మేలు జరుగుతుందని ఆశించి ఆ పరీక్షలు పెట్టడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

ఆ నిర్ణయం తీసుకున్నప్పుడు, ప్రభుత్వం ఉపాధ్యాయులను కూడా సంప్రదించి ఉంటుందనే అనుకోవాలి. ఎందుకంటే పరీక్షలు జరపవలసిన వాళ్ళు ఉపాధ్యాయులే.

పరీక్షావిధానంలో లోపాలు ఉన్నాయనీ, పైగా తమ పని బరువు పెరుగుతుందనీ, అందుకే తాము ఈ పరీక్షలను బహిష్కరించినట్లు, ఉపాధ్యాయులు చెబుతున్నారు. ఉపాధ్యాయుల యూనియన్లకు ప్రధానోపాధ్యాయుల మద్దతు కూడా ఉండడం విశేషం!

బాలల భవిష్యత్తును తీర్చిదిద్దే ఉదాత్తమైన వృత్తిగా ఉపాధ్యాయ వృత్తిని చెబుతూ ఉంటాము. అది వ్యాపారమయం కాకుండా చూసుకోవడం ఎంతయినా అవసరం!


సంపుటి 92 ఆగస్ట్' 93 సంచిక : 2

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00








# ఇద్దరు మహిళా ప్రధానులు






ఇటీవల రెండు దేశాలలో మహిళలను ప్రధాన మంత్రులుగా ఎన్నుకున్నారు. జూన్ 14వ తేదీ శ్రీమతి టాన్సూ సిల్లర్ మొట్టమొదటి టర్కీ మహిళా ప్రధాన మంత్రిగా పదవీ ప్రమాణం చేశారు. పన్నెండు రోజుల తరవాత మిస్ కిమ్ కాంబెల్ కెనడా 19వ ప్రధాని అయ్యారు. కెనడాలో ప్రధాన మంత్రి పదవిని చేపడుతున్న ప్రథమ మహిళ కిమ్ కాంబెల్.

టర్కీ అధ్యక్షుడు టర్గట్ ఒజాల్ ఏప్రిల్ నెలలో హఠాత్తుగా మరణించడంతో, ప్రధానమంత్రి సులేమాన్ డెమిరెల్ టర్కీ అధ్యక్షుడయ్యాడు. ఆ కారణంగా అధికారపక్షమైన 'ట్రూ పాత్ పార్టీ' నూతన ప్రధాన మంత్రిని ఎన్నుకోవలసి వచ్చింది. డెమిరెల్ మంత్రి మండలిలో ఆర్థిక మంత్రిగా ఉన్న నలభై ఏడేళ్ళ శ్రీమతి సిల్లర్ ప్రధానమంత్రి పదవికి పోటీ చేశారు. ఆమెతో 65 ఏళ్ళ 'ఇంటీరియర్' మంత్రి ఇస్మత్ సెస్గిన్ పోటీ పడ్డారు. ఆయనకు 320 ఓట్లూ, సిల్లర్‌కు 574 ఓట్లూ వచ్చాయి. 40 ఏళ్ళ సుదీర్ఘ రాజకీయ జీవితం గడిపిన సెస్గిన్ మీద, మూడేళ్ళ రాజకీయ జీవితం గల సిల్లర్ విజయం సాధించడం విశేషం!

బాస్ఫరస్ విశ్వవిద్యాలయం నుంచి ఆర్థిక శాస్త్రంలో పట్టభద్రురాలయిన శ్రీమతి సిల్లర్, అమెరికాలోని యేల్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యను అభ్యసించారు. ఆ తరవాత ఆమె టర్కీలోని వివిధ విశ్వవిద్యాలయాలలో 1978 నుంచి 'అసోసియేట్,' ప్రొఫెసర్ గానూ 1983 నుంచి ప్రొఫెసర్‌గానూ పనిచేశారు. 1990వ సం॥లో ట్రూ పాత్ పార్టీలో చేరారు. 1991వ సం॥లో డెమిరెల్ మంత్రిమండలిలో ఆర్థిక శాఖను చేపట్టటారు. ఆమె ఆర్థిక మంత్రిగా ఉన్న 20 నెలలలో టర్కీ వ్యాపార రంగంలో మౌలికమైన సంస్కరణలు ప్రవేశపెట్టి 'స్టాక్ ఎక్స్చేంజ్' పనితీరులో అభివృద్ధిని సాధించడానికి కృషి చేశారు. దేశంలోని యువతరం పట్ల, స్త్రీ సంక్షేమం పట్ల కూడా ఆమె ఆసక్తిని కనబరచారు.

టర్కీ పార్లమెంటు అధికార పక్షంలో పురుషులే అధిక సంఖ్యలో ఉన్నారు. వారిలో యాభైయేళ్ళు దాటినవారే అధిక సంఖ్యాకులు. అయినా, వాళ్ళు తమకన్నా చిన్న వయసులో వున్న ఒక వనితను ప్రధాన మంత్రిగా ఎన్నుకోవడం చెప్పుకోదగ్గ విశేషం. రాజకీయాధికారం వయసు మళ్ళిన వాళ్ళ చేతుల నుంచి యువతరానికి మారడం టర్కీ రాజకీయ చరిత్రలో ఒక మైలురాయిగా పరిశీలకులు భావిస్తున్నారు. కాబట్టి దేశం రూపురేఖలు మార్చడానికి శ్రీమతి సిల్లర్ ప్రయత్నించినా ఆశ్చర్యం లేదు.

కెనడాకు కూడా ఒక యువ ప్రధాని లభించారనే చెప్పాలి. ఎందుకంటే మిస్ కిమ్ కాంబెల్ వయసు 46 సంవత్సరాలే. ఆమె మొదట వాంకోవర్‌లో న్యాయవాది వృత్తిని చేపట్టారు. ఆ తరవాత అధికార పక్షమైన 'ప్రోగ్రెసివ్ కన్సర్వేటివ్ పార్టీ'లో చేరి అంచెలంచెలుగా ఐదేళ్ళలో ఉన్నత స్థానాన్ని చేరుకున్నారు.






ప్రధాని బ్రియాన్ మల్రోని ఆమెకు తన మంత్రి మండలిలో మొదట న్యాయశాఖనూ, ఆ తరవాత రక్షణ శాఖనూ అప్పగించారు.

ఉత్తరోత్తరా దేశంలో వ్యాపారం మందగించడం, జాతీయ రుణం పెరిగిపోవడం, వ్యాపార సంస్థలు మూతపడడం, దాని ద్వారా మితి మించిన నిరుద్యోగ సమస్య మొదలైన కారణాల వల్ల దేశ ఆర్థిక పరిస్థితి ఛిన్నాభిన్నమయింది. ఈ కాల ఘట్టంలో ఒక ప్రజాభిప్రాయ సేకరణ జరిగింది. అందులో రాజ్యాంగంలో మార్పులు తేవాలన్న ప్రభుత్వ ప్రతిపాదనను ప్రజలు నిరాకరించారు. పర్యవసానంగా మల్రోని ప్రధాన మంత్రి పదవికి రాజీనామా చేయడానికి నిర్ణయించారు. కాబట్టి అధికార పక్షం నూతన ప్రధానిని ఎన్నుకోవలసి వచ్చింది.

జూన్ 13వ తేదీ జరిగిన ఎన్నికలలో మిస్ కాంబెల్‌కు 53 శాతం ఓట్లూ, ఆమె ప్రధాన ప్రత్యర్థి అయిన పర్యావరణ శాఖ మంత్రి జీన్ చారెస్ట్‌కు 47 శాతం ఓట్లూ వచ్చాయి. రెండవ విడతలో మరొక ప్రత్యర్థి జిమ్ ఎడ్వర్డ్స్, కాంబెల్‌కు మద్దతు నివ్వడంతో ఆమె సులభంగా గెలుపొందింది.

బ్రిటిష్ పార్లమెంటరీ పద్ధతిని అనుసరిస్తున్న కెనడాలో రానున్న నవంబర్‌లో సాధారణ ఎన్నికలు జరుగుతాయి. అప్పుడు కన్సర్వేటివ్ పార్టీ గెలుపొందినట్లయితే కాంబెల్ ప్రధాన మంత్రిగా కొనసాగడం ఖాయం.

పదేళ్ళ క్రితం పీరీ ట్రూడూ ప్రధానమంత్రి పదవి నుంచి వైదొలగినప్పటి నుంచి, లిబరల్ పార్టీ ప్రతిపక్షంగానే ఉంటున్నది.

అమెరికాకు యువకుడయిన బిల్ క్లింటన్ అధ్యక్షుడు కావడం కెనడా ప్రజలకు అసూయగా ఉన్నదని తమాషాగా చెప్పుకునేవారు. అయితే, కెనడా ప్రజలు అధికారాన్ని యువతరానికి అప్పగించాలని భావించడం కూడా కాంబెల్ విజయానికి ఒక కారణం అని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. ఆమెకు కూడా ఇంచు మించు క్లింటన్ వయసే. గిటార్ వాయిస్తుంది. చెస్ ఆడుతుంది. రష్యన్ సాహిత్యం అంటే ఆమెకు ఎంతో అభిమానం. నవంబర్ ఎన్నికల ద్వారా ఆమె తన పదవిని సుస్థిరం చేసుకుంటుందనే చెప్పవచ్చు.

### మహిళా ప్రధానులు

*శ్రీమతి గోల్డా మేయర్ - ఇజ్రాయెల్ *శ్రీమతి ఇందిరాగాంధీ - ఇండియా *శ్రీమతి సిరిమావో బండారనాయకే - శ్రీలంక *శ్రీమతి మార్గరెట్ థాచర్ - ఇంగ్లాండు *శ్రీమతి బెనజీర్ భుట్టో - పాకిస్తాన్ *శ్రీమతి బేగం ఖలీదా జియా - బంగ్లాదేశ



# బామ్మ వాక్కు!

ఒక సామాన్య రైతు కుటుంబానికి చెందిన కృష్ణవేణికి, కూతురి పెళ్ళిసమస్య పెద్ద తల నొప్పిగా తయారైంది. అందమైన కూతురు పుట్టిందని అత్తగారు చెప్పినట్లుగా, ఆ పిల్లకు అప్సరస అని పేరుపెట్టుకున్నది. అప్సరసకు ఏడాది నిండకుండా,ఏదో జబ్బుచేసి ఆమె తండ్రి చనిపోయాడు.కృష్ణవేణి, కూతురును అష్టకష్టాలు పడి పెంచి పెద్దచేసింది.

అయితే, దురదృష్టవశాత్తూ అప్సరస వెర్రి బాగులది. పెళ్ళీడొచ్చినా ఆమె చిన్నపిల్లలతో వీధిలో గోలీకాయలు ఆడుతూండేది.

ఒక రోజు సాయంత్రం వీధిలో ఆడు కుంటున్న అప్సరస, మంచినీళ్ళ కోసం ఎదురింటి తలుపు తట్టింది. ఇంటావిడ తలుపు తెరిచి, "మంచినీళ్ళు మీ ఇంటికి పోయి తాగలేవా? అయినా, వీధిన పడి ఆటలేమిటి? ఇక నీపెళ్ళి అయినట్టే!" అంటూ మంచి నీళ్ళలోటా అప్సరసకు ఇచ్చింది.

ఆ వేళాకోళానికి అప్సరస కోపంగా నీళ్ళ లోటా కింద పారేసి, ఏడుస్తూ ఇంటికి పరి గెత్తింది. జరిగింది విన్న ఆమె బామ్మ, "ఏడ వకేతల్లీ! నీకుపెళ్ళికాకపోవడమేమిటి? పేరు కుతగ్గట్టు అప్సరసలా వున్నావు. నీ పెళ్ళిమా మూలు మనిషితో కాదు. ఏరాజకుమారుడో నిన్నువెతుక్కుంటూవస్తాడు చూడు!" అన్నది ఆప్యాయంగా అప్సరస కన్నీళ్ళు తుడుస్తూ.

ఆనాటినుంచీ అప్సరస చిన్నపిల్లలతో ఆటలు మానేసింది. ఒకరోజు రాత్రి మంచి నీళ్ళ కోసం నిద్ర లేచిన కృష్ణవేణికి, కిటికీ దగ్గర కూర్చుని చీకట్లోకి చూస్తున్న కూతురు కనిపించింది. ఇది చూసి నిర్ఘాంతపోయిన కృష్ణవేణి, అప్సరసను, "అదేమిటే, అక్కడ కూర్చున్నావు? నిద్రపట్టడం లేదా?" అని అడిగింది.

"నేను నిద్రపోతుంటే, నా కోసం వెతు కుంటూ వచ్చిన రాజకుమారుడు, మన

మాచిరాజు కామేశ్వరరావు



ఇల్లు తెలియక వెళ్ళిపోతాడని, ఇక్కడ కూర్చున్నాను," అన్నది అప్పరస.

ఆ వెర్రిపిల్ల మనసులో అటువంటి ఆలోచనలు రావడానికి కారణం అయిన అత్తగారి మీద, కోపం వచ్చింది, కృష్ణవేణికి.

ఆమె అత్తగారి మంచం దగ్గరికి పోయి, "చూడండి, మీ నిర్వాకం!" అంటూ ఆమెను తట్టి లేపబోయింది.

అయితే, కృష్ణవేణి అత్తగారి శరీరం మంచుముద్దలా వున్నది. ఆమె చనిపోయి అప్పటికే చాలాసేపయి వుంటుంది. పెద్ద దిక్కుగా వున్న అత్త పోవడం, కొత్తగా అప్పరసకు పట్టుకున్న రాజకుమారుడి పిచ్చి కృష్ణవేణిని ఎంతగానో బాధించాయి.

రెండునెలలు గడిచాక, కృష్ణవేణి కూతురు పెళ్ళి చేయాలని గట్టి ప్రయత్నాలు ప్రారంభించింది. ఉన్న వూళ్ళో అప్పరసను చేసుకోవడానికి ఎవరూ ముందుకు రాలేదు. ఒక మధ్యవర్తి ద్వారా పొరుగూరు నుంచి ఒక సంబంధం వచ్చింది. పిల్లవాడు అనాకారి, ఒక కన్ను మెల్ల. పిల్ల వెర్రిబాగులదయినా, తమపిల్లవాడికి పెళ్ళంటూ అయితే చాలని, వాడి తల్లి దండ్రులు అప్పరసను చూడడానికి వచ్చారు.

పెళ్ళి చూపులో అప్పరస, పెళ్ళికొడుకును, "నువ్వు ఏదేశపు రాజకుమారుడివి?" అని అడిగింది.

"మా అబ్బాయి పొలం పనులు చేసుకుంటాడు," అన్నది పెళ్ళికొడుకు తల్లి కల్పించుకుని.

"బురద పిసుక్కునే వాడితో, నా పెళ్ళా? ఛీ,ఛీ! నాకోసం రాకుమారుడు వస్తాడు," అంటూ అప్పరస కోపంగా లోపలికి వెళ్ళి పోయింది.

"వెర్రిబాగులదంటే ఏమో అనుకున్నాను! మరీ ఇంత పిచ్చా?"అని పెళ్ళికొడుకును తీసుకుని రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది, పెళ్ళికొడుకు తల్లి.

ఆ రాత్రి తమవంటి పేదలకు, రాజకుమారుడితో పెళ్ళి అనేది అసంభవం అని కూతురుకు ఎన్ని విధాలుగానో నచ్చచెప్పాలని చూసింది, కృష్ణవేణి.

అయితే, అప్సరస మొండిగా, "నీ కన్నా పెద్దది బామ్మ చెప్పింది, నాకోసం రాజకుమారుడు వెతుక్కుంటూ వస్తాడని. వచ్చేదాకా ఎదురుచూస్తాను," అన్నది.

ఈ విధంగా కూతురి పెళ్ళిసమస్య పెద్ద తలనొప్పిగా తయారయింది, కృష్ణవేణికి.

నాలుగు రోజుల తర్వాత, ఒక అర్ధరాత్రి వేళ అప్సరస రాజకుమారుడి కోసంఎదురు చూస్తూ, కిటికీ పక్కన కునికిపాట్లు పడుతూండగా, కృష్ణవేణి పెరట్లోవున్న చింత చెట్టుకింద కూర్చుని, ఉక్రోషం కొద్దీ తన అత్తగారిని నానా తిట్లు తిడుతూ, "నువ్వు స్వర్గంలో వున్నావో, నరకంలో వున్నావో నాకు తెలియదు. ఇక్కడ నా బతుకును మాత్రం నరకం చేసి పోయావు. నీ బుద్ధి తక్కువ వాగుడు నాకొంప ముంచింది. నా కూతురు బతుకు వల్లకాడు కాబోతున్నది!" అంటూ మెటికలు విరవసాగింది.

ఆ సమయంలో, గ్రామం చుట్టి తన నివాసమైన అడవికేసి పోతూ, అలుపు తీర్చుకునేందుకు చింతచెట్టు కొమ్మల్లో కూర్చున్న మగపిశాచం ఒకటి, కృష్ణవేణి తిట్లు విని, "అగు, అక్కా! చనిపోయిన వాళ్ళను — అందునా, అత్తగారంతావిణ్ణి, తిట్టిన తిట్టు తిట్టకుండా అలాతిట్టవచ్చా?"అంటూ కృష్ణవేణి ముందు దూకింది.

పిశాచాన్ని చూసి కృష్ణవేణి హడలిపోయినా, అది అక్కా అంటూ వరస కల



పడంతో ధైర్యం కూడగట్టుకుని," ఏం చేయను, తమ్ముడూ? నాబాధ మరొక ప్రాణితో చెప్పుకునేదా!" అంటూ తన బాధంతా పిశాచంతో చెప్పింది.

అంతా విన్న పిశాచం ఒక క్షణం ఆలోచించి, దిగులుగా, "అక్కా! తారుమారు లోకాలైపోయాయిగాని, లేకపోతే అప్సరస లాంటి మేనగోడల్ని, నేనే కట్టుకునే వాణ్ణి. సరే, రేపు అర్ధరాత్రివేళ నేను వచ్చి, కోడలి రాజకుమారుడివెర్రి కుదురుస్తాను," అని చెప్పి వెళ్ళిపోయింది.

మర్నాడు అర్ధరాత్రివేళ పిశాచం తెల్ల గుర్రంమీద రాజకుమారుడి వేషంలో ఇంటికేసి రాగానే, కిటికీ దగ్గిరవున్న అప్సరస



పొంగిపోయి, చప్పట్లు చరుస్తూ, "ఆహాఁ, బామ్మ వాక్కు డొల్లవుతుందా! రాకుమారా, ఇదే మాఇల్లు. లోపలికి రా," అన్నది.

దానికి పిశాచం,"ఆకాశాన్నంటే మేడల్లోని పైఅంతస్తుల్లో కాలం గడిపే నేను, మీ పూరి పాకలోకి ఎలా రాగలను! గాలి ఆడదు. అలా చల్లగాల్లో వెన్నెల విహారం చేద్దాం. నువ్వే బయటికిరా!" అన్నది.

అప్సరసమారుమాట్లాడకుండాపోయి,తెల్ల గుర్రం మీద కూర్చున్నది. పిశాచం, ఆమెను అడవిలో చాలా దూరం తీసుకుపోయింది.

కొంతసేపయ్యాక అప్సరస,"రాజకుమారా! ఈ అడవిలో నాకు భయంగా వున్నది. ఏమైనా మాట్లాడు," అన్నది.

"మాట్లాడడానికేమున్నదబ్బా?" అంటూ పిశాచం తలగోక్కోపోయి, అది రాజకుమారుడి లక్షణం కాదని తమాయించుకుని, "అతి చిన్న సంగతి! నిన్ననే మా అన్నకు విషప్రయోగం జరిపించాను," అన్నది.

"ఎందుకు?" అని అడిగింది అప్సరస.

పిశాచం వికటంగా నవ్వి, "మా అన్న బతికుంటే నాకు సింహాసనం దక్కదు గదా!" అన్నది.

"అలాగా! అయినా పాపంకదా?" అన్నది అప్సరస.

"పాపపుణ్యాలురాకుమారులజోలికిరావు. రెండు, మూడు రోజుల్లో మా ముసలితండ్రిని పైకి ప్రయాణం కట్టిస్తాను. మాసం తిరక్కుండా రాజునై, చతురంగ బలాలతో పక్క రాజ్యం మీద దాడిచేసి, ఆ రాజ్యాన్ని ఆక్రమించి, ఆ రాజ్యం రాకుమారిని చెర బడతాను", అంటూ పిశాచం విరగబడి నవ్వింది.

రాచరికపు సింహాసనాల మీద ఆశ వున్న వారికి పాపభీతి వుండదనీ, ఎంతటి క్రూర కార్యానికైనా వాళ్ళుసిద్ధపడగలరనీ — ఆకర్షణీయంగా కనిపించే రాకుమారులు రాక్షస మనస్తత్వంకలిగివుంటారనీ,అప్సరస అర్థం చేసుకోవాలని పిశాచం తాపత్రయం.

అయితే, అప్సరసనుంచి ఎటువంటి జవాబూ లేదు.

ఒక క్షణం గడిచాక హఠాత్తుగా పిశాచం, అప్సరసను కిందికి దింపి, "నేను మూడో

జాములో సేనాపతితో రహస్య సమాలోచన జరిపాలి. ఆ సంగతే మరచి, నీతో కాలం వృధా చేస్తున్నాను. ఇక వెళతాను!" అన్నది.

అప్సరస హడలిపోయి, "అర్ధరాత్రి అడవిలో, ఆడపిల్లను వదిలేసి వెళతావా? ఏ పులో, సింహమో తినేస్తే?" అని అడిగింది.

"తినేస్తే తిననీ, అదొక పుణ్యం! నేను రాకుమారుడిని. కోరుకుంటే కోటిమంది అమ్మాయిలు, మా కోట గుమ్మం ముందు వరసకట్టి మరీ నిలబడతారు. నువ్వొక లెక్కా, నాకు!" అంటూ హేళనగా నవ్వేసి, పిశాచం గుర్రాన్నిదౌడుతీయిస్తూవెళ్ళిపోయింది.

అప్సరస పెద్దగా ఏడుస్తూ కూర్చున్నది. ఇంతలో యువకుడొకడు గుర్రం మీద అక్కడికి వచ్చి, "ఎవరు వారు? ఇంత అర్ధరాత్రివేళ,కాకులు ఎగరని కారడవి, చీమలు దూరని చిట్టడవిలో ఒంటరిగా కూర్చుని దుఃఖిస్తున్నారు?" అని అడిగాడు.

"నేను అప్సరసను!" అన్నది అప్సరస.

ఆ జవాబు వింటూనే యువకుడు గుర్రంమీది నుంచి ఒక ఉదుటున కిందికి దూకి,"ఆహాఁ, ఎంత అదృష్టం! నా ఏణ్ణర్థం అన్వేషణ, ఈ అర్ధరాత్రి వేళ అడవిలో ఫలించింది. గుర్రం ఎక్కు! కోటకు పద! రేపే మన వివాహం!" అన్నాడు ఆనందంతో.

అప్సరస అతడికేసిఅనుమానంగాచూస్తూ, "బామ్మవాక్కు ఫలించినట్టేనా! నువ్వు రాజకుమారుడివేనా?" అని అడిగింది.



"ఒట్టి రాజకుమారుణ్ణి కాదు; మహారాజకుమారుణ్ణి! అనవసరంగా ఆలస్యం చేయకు,ఎక్కుగుర్రం", అంటూయువకుడు తొందర చేశాడు.

అప్సరస మహానందంగా గుర్రం ఎక్కి కూర్చున్నది. మర్నాడు తెల్లవారి కృష్ణవేణి, అప్సరస కోసం ఆందోళనగా ఎదురు చూస్తూన్నంతలో, రాజభటులు పల్లకీతో వచ్చి, ఆమెను రాజప్రాసాదానికి తీసుకు పోయారు. అక్కడ రాణీగారు స్వయంగా ఆమెకు ఎదురువచ్చి, "రండి, వదినగారూ! పెళ్ళి పనుల హడావిడిలో, మీ ఇంటికి రాలేకపోయాను, క్షమించండి!" అంటూ చేతులు పట్టుకున్నది.

ఈ జరుగుతున్నదంతా కృష్ణవేణికి కలలా తోచసాగింది. ఇది గ్రహించిన రాణీ, ఆమెతో, "వదినగారూ! ఇదంతా మీకు విచిత్రం అని పిస్తూండాలి కనక సంగతేమిటో మీకు కాస్త వివరంగా చెప్పడం, నాబాధ్యత," అంటూ ఇలా చెప్పింది:

"నా పెద్ద కొడుకు విజయుడు వెర్రిమా లోకం; రెండోవాడు జయుడు చాలా చురుకైన వాడు. ఒకసారి కొందరు రాజకుమారులు నగరానికివచ్చారు. వాళ్ళువిజయుడి వాలకం చూసి, 'నిన్ను ఏదేశపు రాకుమారీ పెళ్ళాడదు. అంతఃపురంలోని ఏ పరిచారికతోనో నీ పెళ్ళి జరిగిపోతుంది!' అనిహేళన చేశారు.

ఇదివిని కళ్ళనీళ్ళతో వచ్చిన విజయుణ్ణి, మా అత్తగారు లాలిస్తూ, 'బెంగపడకురా, బాబూ! ఆ రాజకుమారులంతా మామూలు రాకుమార్తెలను పెళ్ళాడతారు. నీ పెళ్ళిమాత్రం అప్సరసతో జరుగుతుంది. అప్సరసతో! విన్నావా?' అంటూ బుగ్గలు పుణికింది.

ఆ రోజునుంచీ మా అబ్బాయి అప్సరస అన్వేషణలో పడ్డాడు. ఏ రాజకుమారి చిత్రపటం చూపినా, 'ఈ అమ్మాయి అప్సరస కానేకాదు!' అంటూ తిరస్కరించసాగాడు.

ఈ మధ్య వాడికి తనే స్వయంగా అప్సరసను వెతికి పట్టుకుని పెళ్ళాడాలన్న బుద్ధి పుట్టింది. గుర్రం ఎక్కి రాత్రనక పగలనక దేశం నలుమూలలూ తిరుగుతున్నాడు. అదృష్టం కొద్దీ, మీ అమ్మాయి అప్సరస వాడి కంట బడింది. క్షణంలో ఇద్దరూ అన్యోన్యంగా కలిసిపోయారు. త్వరలోనే ఇద్దరికీ పెళ్ళి చేద్దాం. వాళ్ళకేం బరువు బాధ్యతలు లేవుగదా! సుఖంగా భోజనం చేసి, అలా ఉద్యానవనాల్లో విహరించడం తప్ప."

రాణీ చెప్పింది విన్న కృష్ణవేణి, పరమానందంతో, "వదినగారూ! ఊరుకోలేక మనం ఏవేవో ప్రయత్నాలు చేస్తూంటాం గాని, బ్రహ్మరాత ఎలాతప్పుతుంది! ఇక్కడ బ్రహ్మరాతతో పాటు, మా అప్సరస విషయంలో దాని బామ్మ వాక్కు కూడా అమోఘంగా పని చేసింది," అన్నది.

"కాదనలేం, అంతే అయివుండాలి వదినగారూ!" అంటూ రాణీ చిరునవ్వు నవ్వింది.





# విచిత్ర పుష్పం

## 5

[సేనాధిపతి గంభీరసింహుడు దక్షిణ సముద్రతీరానికి వెళ్ళి అక్కడ రాకాసిమృగాన్ని చూసి, తిరిగివచ్చి, ఆ విషయాన్ని రాజుకు తెలియజేశాడు. ఉత్తర ప్రాంతంలో పూచిన 'శతాబ్దిక' పుష్పాలే సముద్రంలోని రాకాసిమృగాన్ని భూమి మీదికి ఆకర్షిస్తున్నాయని రాజగురువు రాజుకు చెప్పాడు. ఈ విషయంగా శృంగ్నాయ కొండలలోని ఉత్తుంగజాతి యువకుల సాయం కోరడానికి అక్కడికి వెంటనే వెళ్ళాలని రాజు నిశ్చయించాడు. —తరవాత]

రాజు ప్రతాపవర్మ వస్తున్నాడని రాజభటులు తెలియజేయగానే ఉత్తుంగ తెగనాయకుడు శుంభుడు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. వెంటనే గూడెమంతా డప్పులు వాయించి, దండోరా వేశారు. క్షణాల్లో ప్రజలందరూ గూడెంముందున్న విశాలమైదానంలో గుమిగూడారు. వాళ్ళనుద్దేశించి వాళ్ళ నాయకుడు శుంభుడు, "మన రాజుగారు కొంతసేపట్లో ఇక్కడికి వస్తున్నాడు. ఆయనకు మనం ఘనంగా స్వాగతం పలకాలి!" అని హెచ్చరించాడు.

ఆ మాట విని అక్కడ గుమిగూడిన వాళ్ళంతా ఇళ్ళకు వెళ్ళి, రకరకాల రంగుల దుస్తులు ధరించి, మళ్ళీ అక్కడికి చేరి రాజు రాక కోసం ఉత్సాహంగా ఎదురు చూడసాగారు.

కొంతసేపటికివాళ్ళకు దూరంగా గుర్రాలు రావడం కనిపించింది. మొదట రెండు



గుర్రాల మీద ఇద్దరు సైనికులు జెండాలు పట్టుకుని వస్తున్నారు. వాళ్ళ వెనక ఆయుధాలు ధరించిన నలుగురు సైనికులూ, వారికి తరవాత రాజూ, యువరాణీ, వారికి ఇరువైపులా ఇద్దరు అంగరక్షకులూ, వారి వెనకగా దళనాయకుడూ, మరి ముగ్గురు అంగరక్షకులూ గుర్రాల మీద వస్తున్నారు.

రాజపరివారం వారిని సమీపించగానే, అంగరక్షకులు మొదట గుర్రాలపై నుంచి కిందికి దిగి, రాజూ, యువరాణీ ఉన్న గుర్రాల దగ్గరికి వెళ్ళారు. కొండజాతి నాయకుడు శుంభుడు రాజుకు చేతులెత్తి నమస్కరించాడు. రాజు మందహాసంతో గుర్రంపై నుంచి కిందికి దిగి, శుంభుణ్ణి ఆప్యాయంగా కౌగిలించుకుని, తన కుమార్తెను అతనికి చూపుతూ, "ఈమె నా కుమార్తె ప్రియంవద. అతడు దళనాయకుడు వీరసింహుడు," అని ఇద్దరినీ పరిచయం చేశాడు.

శుంభుడు రాజును దగ్గరున్న వృక్షం నీడలోకి తీసుకుపోయాడు. అక్కడ వెదుళ్ళతో చేసిన ఒక ఆసనం ఉన్నది. దాని పక్కనే ఉన్న మరొక ముక్కాలిపీట మీద యువరాణిని కూర్చోమని చెప్పి, రాజు, గడ్డి పరిచిన వెదురు ఆసనంలో కూర్చున్నాడు. అప్పుడు కొండజాతి నాయకుడు, "మహారాజా! నిజంగా, మేమెంతో భాగ్యవంతులం! తమవంటి మహాప్రభువులు, ఈ దీనులను వెతుక్కుంటూ ఇంత దూరం రావడం మాకెంతో ఆనందంగా ఉన్నది. తమరినీ, యువరాణిగారినీ మామధ్య చూసుకున్న మహాభాగ్యాన్ని మా మనసులలో పదిలంగా దాచుకుంటాము," అన్నాడు ఆనంద బాష్పాలు రాలుస్తూ.

అంతలో కొందరు యువతులు పళ్ళాలలో ఏవో ఫలహారాలు తెచ్చి, రాజు ముందూ, యువరాణి ముందూ, ఆ తరవాత మిగతా రాజపరివారం ముందూ ఉంచారు. అందరూ వాటిని ఆరగిస్తూండగా అతి శ్రావ్యంగా డప్పుల చప్పుడు వినిపించింది. ఆ తరవాత కొందరు యువతులు వెదురు కర్రలను తెచ్చి, నిలువుగా అడ్డుగా పట్టుకున్నారు. వాళ్ళు, వెనక నుంచి విని



పిస్తూన్న డప్పుల సంగీతానికి అనువుగా కర్ర లను లయబద్ధంగా కదిలిస్తూంటే,అందంగా అలంకరించుకున్న మరికొందరు యువ తులు వచ్చి వాటి మధ్య చక్కగా నాట్యం చేయసాగారు. ఆ వెదురు కర్రల నాట్యాన్ని చూసి యువరాణి చాలా సంతోషించింది.

నాట్యం పూర్తయింది. రాజు ఆసనం నుంచి లేచి, తమ చుట్టూ వలయాకారంగా చేరిన అక్కడి స్త్రీ పురుషులనూ, పిల్లలనూ, పెద్దలనూ ఒకసారి కలయ జూశాడు. వాళ్ళందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. ఆ తరవాత రాజు చేయి పైకెత్తి ఇలా అన్నాడు: "మీరు మాపైన చూపుతూన్న గౌర వాభిమానాలకు ఆనందంతో ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. కొన్నాళ్ళ క్రితం ఇక్కడి నుంచి కొందరు యువకులు రాజ ధానీ నగరంలో జరిగిన ఆటల పోటీలలో పాల్గొని బహుమతులు గెలుచుకున్న విషయం కూడా మా కెంతో ఆనందం కలి గించింది. ఆ సందర్భంలో మీలో కొందరికి సైన్యంలో స్థానం కల్పించగలనని కూడా మాట ఇచ్చాను. ఆ మాటను నిలుపు కుంటాను. అయితే, ప్రస్తుతం నేను మరొక ముఖ్యమైన పనిమీద వచ్చాను. ఈ ప్రాంతా నికే కాదు; మాణిక్యపురి రాజ్యానికే ముసు పెన్నడూ కనీ వినీ ఎరగని పెద్ద అపద సంభ వించింది. అదేమిటంటే — మన దక్షిణ సముద్ర మధ్యం నుంచి ఒక రాకాసిమృగం ఇక్కడి కొండలలో పూచిన శతాబ్దిక పుష్పాల పరిమళం చేత ఆకర్షించబడి అర్ధరాత్రి సమయంలో వెలుపలికి వచ్చి, ఉత్తర దిశగా కొంతదూరం పయనించి, తెల్లవారే సరికి దిక్కు తెలియక మళ్ళీ సముద్రం చేరుతున్నది. అది అలా రావడంవల్ల సముద్ర తీరంలో దాని పాదాల కింద పడిన చెట్టు చేమలూ, ఇళ్ళూ, మనుషులూ, గొడ్లూ, గోడా సర్వం నేలమట్టమై పోతున్నాయి. ఆ భీకర మృగం అదృష్టవశాత్తు మీరు నివ సిస్తూన్న ఈ కొండ ప్రాంతానికి ఇంకా రాలేదు. అతిభీకరమైన ఆ రాకాసి మృగాన్ని ఎదిరించి పోరాడడం మానవ మాత్రులకు సాధ్యం కాని పని. కాబట్టి ఆ మృగాన్ని మన

రాజ్యంలో అడుగు పెట్టకుండా చేయ డానికి రాజగురువు సలహాతో ఒక పథకం ఆలోచించాను. రాకాసిమృగం శతాబ్దిక పుష్పాల చేత ఆకర్షించబడి ఉత్తర దిశగా వస్తున్నట్లు తెలుస్తున్నది. కాబట్టి, దానిని రాకుండా చేయాలంటే అది ఉన్న చోటికే ఆ పుష్పాలను చేర్చడం ఒక్కటే తరుణో పాయం. అందుకు మీ సహాయం కావాలి."

రాజు మాట్లాడడం పూర్తిచేసి కొంత సేపు అయింది కాని, ఎవరూ నోరు తెరవలేదు. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ నాయకుడు శుంభుడు, "మహారాజా! రాజ్య రక్షణ కోసం ప్రాణా లర్పించడం మహాభాగ్యంగా భావించే వాళ్ళం మేము. ఆ రాకాసిమృగం ఆపద నుంచి మన రాజ్యాన్ని కాపాడడం మా కర్త వ్యంగా భావిస్తున్నాము. ఈ రోజు సముద్ర తీర ప్రాంతాలకు వచ్చిన ఆపద, రేపు మా ఈ కొండ ప్రాంతానికి రావచ్చు. ఆ విష యాన్ని మాకు తెలియజేసిన మీకు కృతజ్ఞ తలు తెలియజేస్తున్నాను. ఇప్పుడు మేము ఏం చేయాలో అజ్ఞాపించండి. తక్షణం నెర వేరుస్తాము," అన్నాడు.

నాయకుడి మాటలను ఆమోదిస్తున్నట్టు ప్రజలు చప్పట్లు చరిచారు. అంతలో జనం మధ్య నుంచి ఒక యువకుడు ముందుకు వచ్చి, రాజుకు నమస్కరించాడు.

అతన్ని చూడగానే యువరాణి ప్రియం వద రాజుతో, "విచిత్ర పుష్పాలను కానుకగా



ఇచ్చింది, ఈ యువకుడే!" అని చెప్పింది మెల్లగా.

"అవును, యువరాణీ! ఇంతటి ఆపద ముంచుకు వస్తుందని తెలియక ఆ శతాబ్దిక పుష్పాలను మీకు ఇచ్చిన వాణ్ణి నేనే," అని రాజు కేసి తిరిగి, "ఇప్పుడే నేను శతాబ్దిక పుష్పాలతో రాకాసిమృగం ఉన్న చోటికి బయలుదేరుతాను, ఆజ్ఞాపించండి, మహా రాజా!" అన్నాడు యువకుడు.

"చాలా సంతోషం, ఉత్తుంగా! అందుకు మొదట మీ నాయకుడి అనుమతి తీసుకో," అన్నాడు రాజు.

ఉత్తుంగుడు తమ నాయకుడికేసి తిరిగి చూశాడు.



"ఉత్తుంగుడికి పెద్ద కుటుంబం అంటూ లేదు. చిన్నప్పుడే తల్లిదండ్రులు మరణించారు. ఒకే ఒక చెల్లెలు మాత్రమే ఉన్నది," అన్నాడు శుంభుడు.

అంతలో జనంమధ్య నుంచి ఒక పదిహేనేళ్ళ అమ్మాయి చేతిలో పూలమాలతో ముందుకు వచ్చింది.

"ఈమె, మా చెల్లెలు రజని!" అన్నాడు రాజుతో ఉత్తుంగుడు.

రజని, చేతిలోని మాలను యువరాణి మెడలో వేసింది. చుట్టూ ఉన్న జనం ఆనందంతో ఈలలు వేస్తూ, చప్పట్లు చరిచారు. యువరాణి చిన్నగా నవ్వుతూ, రజని చేయి పట్టుకుని, బుగ్గలు పుణికి, ఉత్తుంగుడికేసి తిరిగి, "నువ్వు, వెళ్ళి తిరిగి వచ్చేంత వరకు మీ చెల్లెలు రజని రాజప్రాసాదంలోనే వుంటుంది," అని, రజనితో, "వస్తావు కదా?" అన్నది.

రజని సిగ్గుతో తలవంచుకుని అలాగే అని తల ఊపింది.

ఆ తరవాత రాజు శుంభుడితో, "ప్రియంవదకు శతాబ్దిక పుష్పాలంటే తీరని మక్కువ ఏర్పడింది. వాటిని రాజోద్యానంలో పెంచాలని కూడా ఆశపడింది. అయితే, అవి శాపగ్రస్తపుష్పాలని రాజగురువు హెచ్చరించడంవల్ల, ఆ ఆశ వదులుకున్నది. కాని, ఆ పుష్పాలను చూడాలన్న కోరికతోనే నా వెంట బయలుదేరి వచ్చింది. ఆ పుష్పా

"శభాష్, ఉత్తుంగా! నీ సాహసానికి మెచ్చాను. అయినా, ఆ రాకాసిమృగాన్ని ఎలా లొంగదీసుకోవాలనుకుంటున్నావు?" అని అడిగాడు నాయకుడు.

"రాజుగారు సెలవిచ్చినట్టు, శతాబ్దిక పుష్పాలన్నిటినీ కోసి, ఒక పడవలో వేసుకుని రాకాసిమృగాన్ని వెన్నంటి వెళ్ళి దాని స్థావరంలో వాటిని పడవేస్తాను. ఆ తరవాత అది మాణిక్యపురికి రావలసిన అవసరమే ఉండదు కదా?" అన్నాడు ఉత్తుంగుడు.

"బావుంది. నువ్వు అలా వెళ్ళి తిరిగి రావడానికి కొన్ని రోజులు పట్టవచ్చు. అంతవరకు నీ కుటుంబాన్ని రక్షించే బాధ్యత మేము తీసుకుంటాము," అన్నాడు రాజు.

లను దూరంనుంచయినా చూడడానికి వీల వుతుంది కదా?" అని అన్నాడు.

"చూడవచ్చు. అదేం కష్టంకాదు, మహా రాజా!" అన్నాడు శుంభుడు.

"తమరు అనుమతించారంటే నేనే యువ రాణిగారి వెంట వెళ్ళి ఆ పువ్వులను చూపి స్తాను. గుర్రాల మీద వెళితే త్వరగా తిరిగి రావచ్చు!" అన్నాడు ఉత్తుంగుడు.

"సరే, ఇప్పుడే బయలుదేరి త్వరగా వెళ్ళి రండి. నేను ఇక్కడే ఉంటాను. మీతో పాటు అంగరక్షకుణ్ణి కూడా తీసుకువెళ్ళండి," అని రాజు యువరాణితో చెప్పి శుంభుడితో, "పద గూడాన్ని చూద్దాం!" అన్నాడు.

ముందు యువరాణీ, ఉత్తుంగుడూ చెరొక గుర్రం మీదా, వారి వెనక, అంగ రక్షకుడు మరొక గుర్రం మీదా శతాబ్దిక పుష్పాలు పూచివున్న కొండలకేసి బయలు దేరారు. వాళ్ళు చాలా దూరం పయనం చేసి ఒక ఇరుకైన మార్గం చేరుకున్నారు. అప్పుడు ఉత్తుంగుడు, "యువరాణీ, ఇక్కడి నుంచి మీరు జాగ్రత్తగా, కాస్త నిదా నంగా గుర్రాన్ని నడిపించాలి. దారికి ఇరువై పులా ఉన్న చెట్ల కొమ్మలు మరీ కిందికి ఉంటాయి," అని హెచ్చరించాడు.

అలా కొంత దూరం వెళ్ళాక, "అదిగో, చూడండి ఆకాశాన్నంటుతున్న చెట్లకు పూచిన మెరుపువ్వుల్ని! అవే శతాబ్దిక పుష్పాలు!" అన్నాడు ఉత్తుంగుడు.



అద్భుతమైన ఆ దృశ్యం చూసి మయి మరచి పోయింది యువరాణి. కొండల మీద వెదురు పొదల్లా వున్న చెట్లపై మెరు పుల్లా మెరుస్తున్న ఆ ఎర్రటి పూలను చూసి ఆమె, "ఇంకా కొంచెం ముందుకు వెళ దామా!" అని అడిగింది.

"వద్దు యువరాణీ. గుర్రాలు ఇకపై ముందుకు వెళ్ళలేవు. కాలి నడకన వెళ్ళడం చాలా ప్రయాసతో కూడిన పని," అన్నాడు ఉత్తుంగుడు.

యువరాణి పుష్పాలను చూస్తూ అలాగే నిలబడిపోయింది. కొంతసేపయ్యాక ఉత్తుం గుడు, "ఇకబయలుదేరుదాం, యువరాణీ!" అన్నాడు.

"సుందరమైన ఈ పుష్పాలు శాపగ్రస్తాలు కావడం దురదృష్టకరం. అయినా, మరే దైనా అద్భుతం జరిగి, ఆ శాపం తొలగి పోగలదని అనుకుంటున్నాను," అంటూ ఆమె ఆ దృశ్యం కేసి మరొకసారి తనివి తీరా చూసి, గుర్రాన్ని వెనక్కు మళ్ళించింది.

వాళ్ళు గూడాన్ని చేరేసరికి, రాజు ప్రయాణానికి సిద్ధంగా ఉన్నాడు. తండ్రిని చూడగానే ఆమె, "చాలా అద్భుతమైన దృశ్యం చూశాను నాన్నా! అయినా, ఆ పుష్పాలు సేకరించడం చాలా కష్టమైన పని," అన్నది.

"కష్టమైన పనులు చేయాలంటే మాకు చాలా ఇష్టం, యువరాణీ!" అన్నాడు శుంభుడు.

రాజు ఉత్తుంగుణ్ణి దగ్గరికి పిలిచి, "నీ కార్యం విజయవంతం కావాలని కాంక్షిస్తున్నాను. నీరాక కోసం నేనే కాదు; మన రాజ్య ప్రజలందరూ ఎదురు చూస్తూ ఉంటాము. దేశ క్షేమం కోసం, శాంతి కోసం నువ్వు చేస్తున్న సాహసం ప్రశంసనీయం," అని చెప్పి, శుంభుడి కేసి తిరిగి, "ఉత్తుంగుడు బయలుదేరిన తరవాత, అతడి చెల్లెలు రజనిని రాజప్రాసాదానికి తీసుకురా," అంటూ ఆసనం నుంచి లేచి ముందుకు నడిచాడు.

యువరాణి, రజని భుజం మీద చేయి వేసి అప్యాయంగా ఆమె చేతిని స్పృశించి, గుర్రం మీదికి ఎక్కింది. ఆ తరవాత రాజు గుర్రాన్ని అధిరోహించాడు. ఆయన వెనక దళనాయకుడూ, ఆ పిమ్మట అంగరక్షకులూ గుర్రాల మీదికి ఎక్కారు.

శుంభుడు చేతులు జోడించి రాజుకు నమస్కరిస్తూ వీడ్కోలు చెప్పాడు. పరివారంతో రాజు ముందుకు కదిలాడు.

ఆ తరవాత శుంభుడు, ఉత్తుంగుడి భుజాన్ని అప్యాయంగా పట్టుకుని గూడెం కేసి నడుస్తూ, "నాయనా, ఉత్తుంగా! నీ సాహసం మెచ్చతగినది. నీ మూలంగా మన ఉత్తుంగ వంశానికి చిరకాలం నిలిచే కీర్తి లభిస్తుంది. నువ్వు తలపెట్టిన కార్యం అపాయకరమైనదే కాని, జగన్మాత కరుణా కటాక్షం వల్ల, నువ్వు విజయంతో సురక్షితంగా తిరిగి రాగలవు!" అన్నాడు ఎంతో ఆనందంగా.

— (ఇంకావుంది)





# అవతారపురుషుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ విశ్రాంతి, నిద్రా సుఖాలకు దూరమై, గూబలూ, విషసర్పాలూ, ఆకలిగొన్న నక్కలూ తిరుగాడే, ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న శ్రమ అర్థహీనంగా తోస్తున్నది. నీ జీవితాశయం, ధ్యేయం ఏమిటి? గొప్ప కీర్తి సంపాయించాలనా? లేక అంతులేని సంపదా, అధికారం చేజిక్కించుకోవాలనా? ఎందుకంటే, మనిషి ఆవేశాలకూ, ఉద్వేగాలకూ లొంగకుండా ప్రశాంతంగా తన జీవితధ్యేయం ఏమిటో నిర్ణయించుకోగలిగినప్పుడే, ఏ బృహత్కార్యాన్నయినా సాధించ గలడు. అలా కానప్పుడు, దివ్యనాథుడనే పండితుడిలాగా తను సాధించ దలచినదేమిటో, సాధించిన

## బేతాళ కథలు



దేమిటో తెలుసుకోలేని అయోమయ పరిస్థితికి గురి కాగలడు. నీకు ముందే హెచ్చరికగా వుండేందుకు ఆయన కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకానొకప్పుడు జగత్సేనుడనే రాజుండేవాడు. ఆయనకు తన ఆస్థానంలోని కళాకారులంటే గిట్టేది కాదు. వాళ్ళ వల్ల దేశానికే ప్రయోజనమూ లేదని నమ్మి, అందరికీ ఉద్వాసన చెప్పాలనుకుని మంత్రిని సలహా అడిగాడు.

ముందుగా మంత్రి గాయకులను పిలిచి, కోరినప్పుడల్లా పాటలు పాడి వానలు కురిపించమన్నాడు. అది వారివల్ల కాలేదు. రాజు వారందరికీ ఉద్వాసన చెప్పాడు. తర్వాత మంత్రి చిత్రకారులనూ, శిల్పులనూ పిలిచి దేవుడికి రూపకల్పన చెయ్యమన్నాడు. వాళ్ళు వేసిన దేవుడి బొమ్మలను, చెక్కిన దైవమూర్తులను చూసి, "దేవుడిలాగే వుంటాడనడానికి సాక్ష్యమేమిటి?" అని అడిగాడు.

వాళ్ళు చెప్పలేకపోయారు. రాజు వారికీ ఉద్వాసన చెప్పాడు.

తర్వాత మంత్రి నటులను, నాట్యకత్తెలను పిలిచి చాటుగా వారికొక కథ చెప్పి, ఆ కథను రాజు ముందు మాటలేకుండా అభినయించమన్నాడు. వారి అభినయాన్ని బట్టి రాజు కథలేమిటో చెప్పలేకపోయాడు. వాళ్ళు కూడా ఆస్థానాన్ని విడిచిపెట్టక తప్పలేదు.

చివరగా మంత్రి, కవి పండితులను పిలిచి, "యువరాజు యుద్ధ విద్యలలో ఆరితేరాడు. కానీ జ్ఞానానికి సంబంధించిన చదువు రావడం లేదు. అతడికి సకల శాస్త్రాలూ నేర్పి, మీకంటే గొప్పవాణ్ణి చేయాలి," అన్నాడు.

వాళ్ళు యువరాజును పరీక్షించారు. అతడి తెలివి అంతంత మాత్రం. ఎంత చిన్న విషయాన్నయినా, ఒకటికి పదిసార్లు చెప్పినా అర్థం చేసుకోలేడు. పైగా యువరాజునన్న గర్వం కూడా వుంది. అందువల్ల అతడికి చదువు చెప్పడం వారివల్ల కాలేదు. దానితో వాళ్ళూ ఆస్థానాన్ని విడిచిపెట్టారు.

ఇలా వుండగా, దివ్యనాధుడనే పండితుడు తన ప్రతిభను చూపి, ఎనలేని కీర్తి ప్రతిష్ఠలనూ,

ధనాన్నీ సంపాయించాలని, జగత్సేనుడి పొరుగు రాజైన మహాసేనుడనే రాజు కొలువుకు వెళ్ళాడు. అక్కడి పండితులందరిదీ మిడిమిడి జ్ఞానం. వాళ్ళు దివ్యనాధుణ్ణి నిండు కొలువులో అపహాస్యం చేశారు.

దివ్యనాధుడు చలించక రాజు వంక తిరిగి, "మహాప్రభూ! మీ కొలువుకు నా అవసరం చాలా వుంది. మిడిమిడి జ్ఞానంతో వున్న మీ ఆస్థాన పండితులందరికీ జ్ఞానబోధ చేయాలి. అది నావల్ల తప్ప మరెవరికీ సాధ్యం కాదు," అన్నాడు.

మహాసేనుడు నవ్వి, "నా ఆస్థాన పండితులది మిడిమిడి జ్ఞానమే అనుకుందాం. నువ్వు మహాపండితుడనడానికి ఋజువేమిటి?" అని ప్రశ్నించాడు.

"మీ ఆస్థాన పండితులలో ఒకరిని నా శిష్యుడిగా స్వీకరిస్తాను. ఒక నెల రోజుల తర్వాత అతడిలో వచ్చిన మార్పును, తమరే స్వయంగా పరిశీలించవచ్చు," అన్నాడు దివ్యనాధుడు.

మహాసేనుడు తల అడ్డంగా వూపి, "పొరుగు రాజ్యాన్ని నా దూరపు బంధువైన జగత్సేనుడు ఏలుతున్నాడు. ఆయన కళాకారుల నేవగించుకుని, వారికి తన ఆస్థానంలో చోటు లేకుండా చేశాడు. నువ్వు నీ ప్రతిభను అక్కడ నిరూపించుకుని రాగలిగితే, మొత్తం నా పండితులందరినీ నీకు శిష్యులను చేస్తాను," అన్నాడు.



రాజు ఇలా అనగానే, దివ్యనాధుడు పట్టుదలకొద్దీ జగత్సేనుడి వద్దకు వెళ్ళాడు. ఆయన చిరాకుగా, "నాకు కవి పండితులన్నా, కళాకారులన్నా సదభిప్రాయం లేదు. నువ్వు మరే రాజు దగ్గరికైనా వెళ్ళు," అన్నాడు.

దివ్యనాధుడు వెంటనే, "మహాప్రభూ! నేను కవిని, పండితుణ్ణి మాత్రమే కాదు, అన్ని కళల్లోనూ పాండిత్యమున్నవాణ్ణి. ఎందరో రాజులు నాకాశ్రయమిస్తామన్నారు. కానీ కాళిదాసును భోజరాజు, తెనాలి రామకృష్ణుణ్ణి శ్రీకృష్ణదేవరాయలూ ఆకర్షించినట్లు తమరు నన్నాకర్షించారు," అన్నాడు.

ఇదివిని జగత్సేనుడు పొంగిపోతూ, "ఏమిటి నాలోని ఆ ప్రత్యేకత?" అని అడిగాడు.



"మహాప్రభూ! మీరు కారణజన్ములు, అవతారపురుషులు. అకారణంవల్లనే, మీ ఆస్థాన కళాకారులందరూ, మీముందు విఫలులయ్యారు," అన్నాడు దివ్యనాధుడు.

జగత్సేనుడు సాలోచనగా, "నా గొప్పతనానికీ, నా ఆస్థాన కళాకారుల అసమర్థతకూ సంబంధమేమిటి?" అన్నాడు.

"ప్రభూ! తమ పాలనలో దేశం సుభిక్షంగా వుంది. ప్రకృతి ప్రశాంతంగా వుంది. వాతావరణం ఋతుధర్మాలను పాటిస్తున్నది. ఈ దేశంలో అకాలమృత్యువులూ, అకాలవర్షాలూ అసాధ్యం. ఎంత గొప్ప గాయకుడైనా దైవ ధిక్కారమైనా చేసి తన గానంతో కృత్రిమ వర్షాలు కురిపించగలడేమో కానీ, తమ శాసనాన్ని ధిక్కరించి ప్రకృతి క్రమాన్ని మార్చలేడు. ఇది తెలిసిన తర్వాత అయినా, తమ గొప్పతనాన్ని ఒప్పుకుంటారా?" అన్నాడు దివ్యనాధుడు.

జగత్సేనుడు ఉబ్బితబ్బిబ్బవుతూ, "గాయకుల విషయమలా వుంచు. మరి ఆస్థాన శిల్పులు, చిత్రకారుల సంగతేమిటి?" అని ప్రశ్నించాడు.

"ప్రభూ! ఒకప్పుడు పరశురాముడు అవతార పురుషుడు. రామావతారం రాగానే, పరశురాముడి తేజస్సు తగ్గిపోయింది. కొత్త అవతారం వచ్చినప్పుడల్లా, పాత అవతారాల తేజస్సు తగ్గిపోతుందని అందరికీ తెలుసు. భగవంతుడిప్పుడు మీ అవతారంలో వున్నాడు కదా! అందువల్ల, వారెంత ప్రయత్నించినా పూర్వపు అవతార పురుషుల చిత్రాలు, శిల్పాల్లో తేజస్సును చూపలేకపోయారు," అన్నాడు దివ్యనాధుడు.

"నేను దేవుడిననడానికి ఋజువేమిటి? ఒక్క మాయ చేయడం కూడా నాకు చేతకాదు," అన్నాడు జగత్సేనుడు.

"శ్రీరాముడు మాయలు చేయలేదు. గౌతమబుద్ధుడు మాయలు చేయలేదు. వారి వారి గొప్ప పనులను బట్టి వారందరూ దేవుళ్ళుగా గుర్తింపబడ్డారు. అంతేకాక, దైవభక్తి వున్న వారికి మాత్రమే దేవుడు తెలుస్తాడు. మాయలు చేసిన కృష్ణుణ్ణి మాత్రం దేవుడని కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు,

దుర్యోధనుడు ఒప్పుకున్నారా? నాకు చిన్న తనం నుంచీ దైవభక్తి ఎక్కువ. నాకు మీలో దేవుడు కనిపిస్తున్నాడు. అయినా, దీనికి నేను ఋజువు తేలేను. మహాభక్తులైన ఆస్థాన చిత్రకారులూ, శిల్పులూ చూపిన కాస్తపాటి ఋజువును కూడా నేను తేలేను," అన్నాడు దివ్యనాథుడు.

"నేను దేవుడినని నా ఆస్థాన చిత్రకారులూ, శిల్పులూ ఋజువెప్పుడు చేశారు?" అని అడిగాడు జగత్సేనుడు ఆశ్చర్యంగా.

"అయితే మీకు తెలియదా, ప్రభూ! దేవుడి రూపం అనగానే వాళ్ళు వెంటనే మీ రూపాన్నే ఎన్నుకున్నారు. బొమ్మలు వేశారు, శిల్పాలు చెక్కారు, కానీ ఎదురుగా కనబడే సూర్యుడి బొమ్మ వేయమన్నా, చేయమన్నా ఆకారం తీసుకురాగలం కానీ, ఈ తేజస్సుకు రూపకల్పన చేయలేము కదా! తమ చిత్రాల్లో, శిల్పాల్లో మీ తేజస్సు కనబడక వాళ్ళు అసంతృప్తి చెంది, చివరకు పురాణ పురుషుల బొమ్మలు వేశారు. ఇంకొక వందేళ్ళు పోయాక అవతారపురుషుడు దేవుడి బొమ్మ వేయమన్నా డనుకోండి. అప్పుడు వాళ్ళేం చేస్తారు? జగత్సేనుడి బొమ్మ వేసి వూరుకుంటారు," అన్నాడు దివ్యనాథుడు.

ఈ మాటలు వింటూ జగత్సేనుడు సంతోషంపట్టలేకపోయాడు. ఆయన దివ్యనాథుడి తెలివిని మెచ్చుకుని నటుల గురించీ, నాట్యకత్తెల గురించీ అడిగాడు.



"ప్రభూ! దైవాంశ సంభూతులు సృష్టించిన కథలు, కావ్యాలను మాత్రమే నటులు చక్కగా అభినయించగలరు. లేదా అవతార పురుషులైన తమరే ఏదైనా కొత్త కథలను సృష్టించి చెప్పండి. తమకర్థమయ్యేలా నటించగలరు. అంతే కానీ జ్ఞానశూన్యులల్లిన కథలను అభినయించమనడం న్యాయం కాదు," అన్నాడు దివ్యనాథుడు.

పక్కన వున్న మంత్రి కీమాటలు కష్టంగా తోచాయి. ఆయన వెంటనే కొందరు నటులను రప్పించాడు. రాజు వారికి చాటుగా కథ చెప్పి, మాట లేకుండా అభినయించ మన్నాడు. నటులలా చేయగానే జగత్సేనుడు సంతోషంగా, "ఆహా! దివ్యనాథుడు చెప్పిన



మాట దివ్యంగా వుంది. వీరి అభినయం ఎంతో గొప్పగా వుంది," అన్నాడు.

"నాకు వీరేమి అభినయించారో తెలియ లేదు. దివ్యనాధుడికేమైనా తెలిసిందేమో చెప్పమనండి!" అన్నాడు మంత్రి వ్యంగ్యంగా.

దివ్యనాధుడు నవ్వి, "అవతార పురుషుల లీలలు వేద వేదాంగాలు చదివినవారికీ, బ్రహ్మాది దేవతలకు కూడా అర్థం కావు. ఆయన చెప్పనిదే ఆ కథ మనబోటి అల్పుల కెలా అర్థమవుతుంది?" అన్నాడు.

జగత్సేనుడు ఆనందం పట్టలేక చప్పట్లు కొట్టి, "దివ్యనాధా! ఇంతకాలం యోగనిద్రలో వున్న నాలోని అవతారపురుషుణ్ణి నిద్ర లేపావు. ధన్యవాదాలు. ఇక నా కుమారుణ్ణి సకల శాస్త్రపారంగతుణ్ణి చేస్తే, అందుకు నీకెంతో ఋణపడి వుంటాను," అన్నాడు.

"యువరాజుకు విద్యాబోధన చేసే అవ కాశం వస్తే అది నా అదృష్టం. అతణ్ణి సకల శాస్త్రపారంగతుణ్ణి చేయడానికి నాకు ఒక రోజు చాలు," అన్నాడు దివ్యనాధుడు.

ఒక్కరోజనగానే జగత్సేనుడాశ్చర్యపడ్డాడు.

అప్పుడు దివ్యనాధుడు, యువరాజును ఏకాంతానికి తీసుకువెళ్ళి, "నీ తండ్రి దేవుడు. కారణజన్ముడు. నువ్వు కూడా అవతార పురుషుడివి కావాలంటే, అందుకు రెండు మార్గాలున్నాయి. నువ్వు వారానికి రెండు రోజులు ఉపవాసం వుండి, తల్లక్రిందులుగా చెట్టుకొమ్మకు వేళ్ళాడి తపస్సు చేస్తూ పదేళ్ళ పాటు సకల శాస్త్రాలూ నేర్చుకోవాలి. ఇది అతికష్టమైన మార్గం. రెండోది — నువ్వు నాలుక చాపితే దానిపై నేను బీజాక్షరి రాస్తాను. నీకేది ఇష్టమో కోరుకో!" అన్నాడు.

యువరాజు ఉత్సాహంగా, "నాకు రెండో మార్గమే ఇష్టం!" అంటూ నాలుక చాపాడు.

దివ్యనాధుడు తృప్తిగా యువరాజు భుజం తట్టి, "కొంచెం ఆగు! దీనికి కొన్ని నియమా లున్నాయి. నేను బీజాక్షరి రాశాక నువ్వు కోపాన్ని పూర్తిగా విడిచిపెట్టి శాంతంగా వుండాలి. నీకంటే పెద్దవారిని జాతి కుల విచక్షణ లేకుండా గౌరవించాలి. నీకంటే చిన్నవారిని అభిమానించాలి. అన్నీ నీకు తెలిసినా సరే, ఇతరుల సలహా లేకుండా ఏ

పనీ చేయకూడదు. ఎప్పుడూ నవ్వుతూ వుండాలి. ఇవి పాటించకపోతే, నేను రాసిన బీజాక్షరిలోని ప్రతి అక్షరం ఒక భూతమై నిన్ను కష్టాలపాలు చేస్తుంది. ఏమంటావు?" అని హెచ్చరించాడు.

యువరాజుకిదేమీ కష్టమనిపించలేదు. అన్నింటికీ ఒప్పుకున్నాడు. దివ్యనాధుడు, యువరాజు నాలుకపై బీజాక్షరి రాశాక జగత్సేనుడి వద్దకు వెళ్ళి, "ప్రభూ! యువరాజు అత్యంత సూక్ష్మగ్రాహి. నేను అనుకున్నదాని కంటే తక్కువ సమయంలో సకల శాస్త్రాలూ నేర్చుకున్నాడు," అని చెప్పాడు.

జగత్సేనుడు సంతోషిస్తే, మంత్రికేమనాలో తోచక, "మహారాజా! నాకు కఠోపనిషత్తులో కొన్ని సందేహాలున్నాయి. అవి యువరాజు నడిగి తెలుసుకుంటాను," అన్నాడు.

ఇది వింటూనే దివ్యనాధుడు, "ప్రభూ! ధర్మరాజు ముక్కుపచ్చలారని అభిమన్యుడిని పద్మవ్యూహాన్ని ఛేదించమని పంపితే, ఏమయింది? అనుభవ శూన్యులు విద్యాబోధనకు పనికిరారు. మన యువరాజు మరొక పది సంవత్సరాల వరకూ, అభిమన్యుడి వంటి వాడు. అతడు విద్యల నెన్నింటినైనా సులభంగా నేర్వగలడు. విద్యాబోధనకు తలపడితే మాత్రం ప్రాణ సంకటం," అన్నాడు.

జగత్సేనుడు కలవరపడుతూ, "నా కుమారుడు విద్యావంతుడైనాడనడానికి నిదర్శనమేమిటి?" అని అడిగాడు.




"విద్యావంతులను వాళ్ళ ప్రవర్తన ద్వారా గుర్తించవచ్చు! ఈ రోజు నుంచీ యువరాజు ప్రవర్తనలో మార్పును గమనించండి!" అన్నాడు దివ్యనాధుడు.

వారం రోజుల్లో యువరాజులో వచ్చిన మార్పులన్నీ గమనించి, జగత్సేనుడు ఆశ్చర్యానందాలతో దివ్యనాధుణ్ణి ఆస్థానంలో వుండిపొమ్మని కోరాడు. అయితే, దివ్యనాధుడు అందుకు ఒప్పుకోక, జగత్సేనుడి గొప్పతనాన్ని దేశదేశాలూ సంచరిస్తూ కీర్తించడమే తన జీవితాశయమన్నాడు.

జగత్సేనుడు ఇందుకు ఆనందంతో పరవశుడైపోయి, దివ్యనాధుణ్ణి వెలలేని కానుకలతో ఘనంగా సత్కరించాడు. దివ్యనాధుడు

అక్కడినుంచి బయలుదేరి, కొద్ది రోజుల తర్వాత మహాసేనుడి కొలువుకు చేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దివ్యనాథుడు కీర్తిప్రతిష్ఠలూ, ధనసంపాదనా తన జీవితాశయంగా, ధ్యేయంగా భావించి, వాటి కోసం రాజు మహాసేనుడి కొలువుకు వెళ్ళాడు. అయితే, మహాసేనుడు అతడి పాండిత్యాన్ని శంకించి, తన బంధువైన జగత్సేనుడి వద్దకు వెళ్ళమన్నాడు. దివ్యనాథుడు జగత్సేనుడి ఆస్థానంలో తన తెలివి తేటలు ప్రదర్శించి, కీర్తితో పాటు రాజు వల్ల వెలలేని కానుకలు కూడా పొందగలిగాడు. అయినా అయన, ఆ రాజును విడిచి, తిరిగి మహాసేనుడి వద్దకు వెళ్ళడం వింతగా లేదా? ఇది, సాధించదలచినదేమిటో, సాధించినదేమిటో తెలియని అయోమయ స్థితే గదా? దీన్ని బట్టి దివ్యనాథుడికి, ఒక స్థిర బుద్ధీ, ధ్యేయం లేనట్లు కనబడడంలేదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దివ్యనాథుడి జీవితాశయం, రాజాస్థానాల్లో తన పాండిత్యాన్ని ప్రదర్శించి కీర్తి, ధనం సంపాయించాలనే! అయితే, రాజు జగత్సేనుడిలో కళాభిమానం మాట అట్లా వుంచి, కొద్దిపాటి తెలివి కూడా లేదని అతడు గ్రహించాడు. అందువల్లనే, అతడు ఆ రాజు ఆస్థానంలో తన శాస్త్ర పాండిత్యాన్ని కాక, బుద్ధికుశలతనూ, లోక జ్ఞానాన్నీ ప్రదర్శించవలసి వచ్చింది. నువ్వు అవతార పురుషుడివని దివ్యనాథుడంటే, జగత్సేనుడు అతి సులభంగా నమ్మేశాడు. గొప్ప పండితుడైన దివ్యనాథుడంతటి వాడు, అలాంటి బుద్ధిహీనుడి ఆస్థానంలో వుండగలగడం సాధ్యంకాని పని. దివ్యనాథుడికి ధనంతో పాటు, ఉద్దండ పండితుడన్న కీర్తి కూడా కావాలి! ఆ కారణం వల్లనే అతడు, జగత్సేనుడు వుండమన్నా వినక, ఆస్థానాన్ని వదిలి పోయాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

[ఆధారం : "వసుంధర" రచన]



# చందమామ అనుబంధం - 58

## మన దేశపు పక్షులు-జంతువులు :

## 'రీసస్' కోతులు



మనుషుల రక్తాన్ని ఆర్.హెచ్. పాజిటివ్, ఆర్.హెచ్. నెగటివ్ అని రెండు రకాలుగా విభజిస్తారు. ఆర్.హెచ్. అనే అక్షరాలు 'రీసస్' అనే ఒక కోతి జాతిని సూచిస్తాయి. అంటే, మనిషితో దగ్గరి రక్త సంబంధం గల జంతువులు ఈ కోతులు!

ఈ కోతులలో ప్రధానంగా 'లాంగర్స్', 'మెకాక్స్' అని రెండు రకాలు ఉన్నాయి. వీటిలో 'రీసస్ మెకాక్' కోతులు ప్రపంచ ప్రసిద్ధి గాంచినవి. ఎందుకంటే వీటి రక్తం దాదాపు మనిషి రక్తం లాగే ఉంటుంది. ఈ కోతులను వైద్య పరిశోధనల కోసం ఎక్కువగా ఉపయోగించేవారు. అందువల్ల వీటిని మన దేశం నుంచి విదేశాలకు విపరీతంగా ఎగుమతి చేసేవారు. ఆ కారణంగా వీటి సంఖ్య బాగా తరిగి పోయి, ఈ జాతి సమూలంగా నాశనమై పోయే పరిస్థితి ఏర్పడింది. దాంతో భారత ప్రభుత్వం ఈ కోతుల ఎగుమతిని నిషేధించి, వాటి రక్షణకు భద్రత కల్పించింది.

రీసస్ కోతులు ఉత్తరభారతదేశంలోనూ, మధ్యభారతదేశంలోనూ ఎక్కువగా నివసిస్తాయి. సంవత్సరంలో దాదాపు ఆరు నెలలు, శీతల వాతావరణాన్ని ఎదుర్కోవలసి రావడం వల్ల, వీటి శరీరాల నిండా ఒత్తుగా రోమాలు ఉంటాయి. వీటి ఎత్తు దాదాపు 60 సెం.మీ. ఉంటుంది.

పల్లెలలోనూ, పట్టణాలలోనూ ముఖ్యంగా దేవాలయాల దగ్గరా, కోనేరుల దగ్గరా, రైల్వేస్టేషన్ల సమీపంలో ఈ కోతులు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయి.




# రాజా రవివర్మ

ఈనాటి కేరళ రాష్ట్రం 1947వ సం॥ వరకు తిరువాన్కూర్, కొచ్చిన్ అనే రెండు సంస్థానాల కింద ఉండేది.

ఆధునిక భారతీయ చిత్ర కళారంగంలో ప్రముఖ స్థానం వహిస్తూన్న రాజా రవి వర్మ తిరువాన్కూర్ రాజవంశానికి చెందినవాడు. ఆయన 1848వ సం॥లో తిరువాన్కూర్ సంస్థానానికి రాజధాని అయిన తిరువనంతపురానికి నలభై కి.మీ. దూరంలో ఉన్న ఒక గ్రామంలో జన్మించాడు.

తప్పటడుగులు వేసే ప్రాయంలోనే రవివర్మ గోడల మీద జంతువుల బొమ్మలూ, చెట్ల బొమ్మలూ గీయడం ప్రారంభించాడు. పెద్దలు వద్దని వారించినప్పటికీ వినిపించుకోకుండా ఏదో ఒక బొమ్మ గీస్తూ ఉండేవాడు. పిల్లవాడిలోని చిత్ర కళ పట్ల ఆసక్తినీ, సామర్థ్యాన్నీ, అతని మేనమామ రాజరాజవర్మ గ్రహించాడు. ఆయన కూడా స్వతహాగా చిత్రకారుడు కావడం వల్ల, ఆ బొమ్మలను చూసి సంతోషించి రవివర్మను ప్రోత్సహించాడు.



ఆ తరవాత రవివర్మ తిరువనంతపురం చేరాడు. తైలవర్ణ చిత్రాలు కొత్తగా ప్రాచుర్యం పొందుతున్న రోజులవి. రాజభవనంలో పనిచేస్తున్న, అళగిరినాయుడు అనే చిత్రకారుడి వద్ద, తైలవర్ణ చిత్రాలు గీసే పద్ధతిని రవివర్మ నేర్చుకున్నాడు.

రవివర్మ మీద సుప్రసిద్ధ డచ్ చిత్రకారుడు థియొడోర్ జెన్సన్ ప్రభావం పడింది. ఆయన దగ్గర చిత్రకళను ప్రత్యక్షంగా అభ్యసిం

చకపోయినప్పటికీ, జెన్‌సన్ చిత్రాలు గీసే పద్ధతిని చూడడం వల్ల ఆ పద్ధతి రవివర్మను ఆకట్టుకున్నది.

రవివర్మ రామాయణం, మహాభారతం మొదలైన మన పురాణ ఇతిహాసాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి, ఆయా పాత్రలనూ, సన్నివేశాలనూ పాశ్చాత్య శైలిలో చిత్రించి అందరి దృష్టినీ ఆకర్షించాడు.

1882వ సం॥లో మద్రాసు గవర్నర్ మద్రాసులో ఏర్పాటుచేసిన ఒక ప్రదర్శనలో రవివర్మ చిత్రానికి బంగారు పతకం లభించింది. ఆ చిత్రాన్ని ఆ తరవాత వియన్నాలో ప్రదర్శనకు ఉంచడంతో, రవివర్మ కీర్తి ప్రపంచమంతటా వ్యాపించింది. ఎనభై యేడవయేట కీర్తిశేషులయ్యేనాటికి ఆయన గొప్ప చిత్రకారుడుగా అంతర్జాతీయ కీర్తి గడించాడు.

విశ్వకవి రవీంద్రనాథ టాగూరు రవివర్మ చిత్రాలను గురించి ఇలా అన్నారు: "రవివర్మ చిత్రాలను చూస్తూ నేనెన్నో ఉదయాలను ఆనందంగా గడిపాను. అవంటే నాకెంతో అభిమానం. పురాణ పాత్రల సజీవ రూపాలను, హావభావాలను, సన్నివేశాలను అద్భుతంగా చూపే చిత్రాలు అవి."



# మీకు తెలుసా?

1. దశరథ మహారాజు కుమార్తె ఎవరు? ఆమెను పెళ్ళాడిన వారెవరు?
2. 'టేబుల్ టెన్నిస్' ఆటను రూపొందించిన వారెవ్వరు? ఎప్పుడు?
3. భోపాల్‌కూ 'భోజపాల్'కూ ఉన్న సంబంధం ఏమిటో తెలుసా?
4. భూమిలో ఎంత భాగాన్ని జలం ఆక్రమించుకుని ఉన్నది?
5. 'తమిళవేదం' అని కీర్తించబడే గ్రంథం ఏది? గ్రంథకర్త ఎవరు?
6. రోమ్‌నగరం లాగే దక్షిణ భారత దేశంలో ఏడు కొండల మీద నిర్మించ బడిన నగరం ఏది?
7. 'వజ్రాలు' ఆమ్లంలో కరగవు. మరి ఎలా కరుగుతాయి?
8. మనదేశంలో ఒక రాష్ట్రానికి కొండతెగ మీదుగా పేరు పెట్టారు. అది ఏది?
9. విక్రమాదిత్యుడి ఆస్థానంలో నవరత్నాలని పేరుగాంచిన మేధావు లెవరు?
10. చైనా చక్రవర్తి ఆస్థానాన్ని అలంకరించిన ఐరోపా అధికారిఎవరు? చక్రవర్తి ఎవరు?
11. 'కరునాడు' అని ఏ ప్రాంతాన్ని పిలిచేవారు?
12. 'విమానం' నమూనాను మొట్టమొదట రూపొందించిన వారెవరు?
13. 'నాయన్‌మార్లు' 'ఆళ్వార్ల' మధ్య ఉన్న తేడా ఏమిటి?
14. ఆంగ్లేయులు కలకత్తాలో నిర్మించిన కోట పేరేమిటి? ఎప్పుడు నిర్మించారు?
15. లోటా నీళ్ళలోని 'ఐసుముక్క' కరిగినప్పుడు లోటాలోని నీటి మట్టం పెరుగుతుందా?

# సమాధానాలు

1. యువరాణి శాంత; ఋష్యశృంగుడనే మునిని.
2. ఇంగ్లాండుకు చెందిన జేమ్స్‌గిబ్. 1888వ సం॥లో.
3. మధ్య ప్రదేశ్ రాజధాని భోపాల్. భోజపాల్ అనే చెరువు మీదుగా దానికా పేరు వచ్చింది.
4. ఇంచుమించు 70 శాతం.
5. 'తిరుక్కురళ్.' తిరువళ్ళువర్.
6. తిరువనంతపురం. తిరు-అనంత-పురం. 'అనంతుడనే' ఆదిశేషుడి పర్వతం మీద నిర్మించ బడిన నగరం.
7. తీవ్రమైన వేడికి.
8. మిజోరం. 'మిజో' అంటే కొండమనిషి.
9. కాళిదాసు, బేతాళభట్టు, ఘటఖర్పరుడు, వరాహమిహురుడు, క్షపణకుడు, అమరసింహుడు, వరరుచి, శంకుడు, ధన్వంతరి.
10. ఇటలీకి చెందిన మార్కోపోలో. కుబ్లాఖాన్.
11. కర్నాటక.
12. సుప్రసిద్ధ చిత్రకారుడు లియోనార్డో డావిన్సీ.
13. నాయన్‌మార్లు శివభక్తులు; ఆళ్వార్లు విష్ణుభక్తులు.
14. విలియం కోట.1696 –1715 మధ్య.
15. పెరగదు.



# జ్ఞాని-మేధావి

పూర్వం ప్రతీహార నగరంలో సూర్యమిత్రుడు, చంద్రశేఖరుడు, చందనమిత్రుడు అనే ముగ్గురు స్నేహితులుండేవారు. వాళ్ళు ముగ్గురూ బాల్యం నుంచీ మంచి స్నేహితులు. ముగ్గురూ ఒకే గురువు వద్ద విద్యాభ్యాసం చెయ్యడం వల్ల, ముగ్గురి మధ్యా మైత్రి నానాటికీ బలపడింది. ముగ్గురిలోనూ చంద్రశేఖరుడు తెలివైనవాడు. మిత్రులిద్దరికీ చదువులో సహాయపడుతూండేవాడు.

ఈ విధంగా రోజులుగడుస్తూ, మిత్రులు ముగ్గురూ పెరిగి పెద్ద వాళ్ళయ్యారు. వాళ్ళ విద్యాభ్యాసం కూడా పూర్తయింది. ఇంకా ఉన్నత విద్యనభ్యసించడం కోసం ఎక్కడికైనా వెళ్ళాలనే ఆలోచన ఒక్క చంద్రశేఖరుడికి తప్ప, మిగతా ఇద్దరిలో లేదు. అయితే, చంద్రశేఖరుడితల్లిదండ్రులకుఅతడొక్కడే సంతానంకావడంచేత, అతణ్ణి విడిచిపెట్టి వుండడానికి వాళ్ళు ఒప్పుకోలేదు.

ఒకనాటి సాయంసమయాన, ముగ్గురూ ఎప్పటిలాగే వాహ్యాళిగా, ఊరిబయట వున్న మామిడి తోపులలో నడుస్తూండగా చంద్రశేఖరుడు, "మన భవిష్యత్తు గురించి నేనొకటి ఆలోచించాను!" అన్నాడు.

"ఏమిటది?" అని మిగతాఇద్దరూ కుతూహలంగా ప్రశ్నించారు.

"అదృష్టవంతుడంటే, అవకాశాలు సృష్టించుకో గలిగినవాడేనని నానమ్మకం! మనం కూడా ఏదో ఒక ఉద్యోగమంటూ చూసుకునినూతిలో కప్పల్లాబతికే బదులు, అవకాశాలు సృష్టించుకుంటూ అభివృద్ధిలోకి రావాలని, నా కోరిక," అన్నాడు చంద్రశేఖరుడు.

"అంటే ఏమిటో మరికాస్త వివరంగా చెప్పు!" అన్నారు సూర్యమిత్రుడు, చందనమిత్రుడు.

"అయితే వినండి! మన ఈ ప్రతీహార నగరంలోనూ, చుట్టుపక్కల ఊళ్ళలోనూ

"లలిత-శర్మిల"



"ఎందుకాకదు? కొద్దిపాటి పెట్టుబడితో ప్రారంభిద్దాం. మొదట్లో కొంచెం కష్టమనిపించినా, రానురాను నిలదొక్కుకోగలం," అన్నాడు చంద్రశేఖరుడు, మిత్రులకు ధైర్యం చెబుతూ.

మరికొంత చర్చ జరిగాక, సూర్యమిత్రుడూ చందనమిత్రుడూ ఉత్సాహంగా చంద్రశేఖరుడు చెప్పిన దానికి తమ అంగీకారం తెలిపారు. చంద్రశేఖరుడు తన తల్లిదండ్రులకు సంగతి చెప్పి, వెంట బాల్యమిత్రులిద్దరు వుంటారు గనక, ఆదుర్దాపడవలసిందేమీ లేదన్నాడు. అయిష్టంగానే అతడి తల్లిదండ్రులు ఇందుకు ఒప్పుకున్నారు.

మొట్టమొదట మిత్రులు ముగ్గురూ తమ తమ సరుకులతో గండసద్వీపం చేరుకున్నారు. అక్కడ విదేశ వ్యాపారస్థుల కోసం ప్రత్యేకంగా కట్టించిన ఒక సత్రంలో బస చేశారు.

"రేపు ఉదయాన్నే ముగ్గురం నగరంలోని తలొక ప్రాంతానికి వెళ్ళి వ్యాపారం ప్రారంభిద్దాం!" అన్నాడు చంద్రశేఖరుడు.

మిత్రులిద్దరూ భయంభయంగానే తలలూపారు. మర్నాటి ఉదయం ముగ్గురు మిత్రులూ నగరంలోకి వెళ్ళి, చీకటిపడుతూండగా తిరిగి సత్రం చేరారు. చంద్రశేఖరుడు, తనమిత్రులిద్దరి ముఖాల్లో ఏమాత్రం ఉత్సాహం లేకపోవడం గమనించి, "అలా వున్నారేం?" అని అడిగాడు.

పోక చెక్కలూ, ఎండు కొబ్బరీ కోకొల్లలుగా దొరుకుతాయి. మనకు కావలసిన సుగంధ ద్రవ్యాలేవీ మన చుట్టుపక్కల పండవు. గండస, మాల్య ద్వీపాల నుంచి వర్తకులు సుగంధ ద్రవ్యాలు తీసుకువచ్చి, మనకు అధికధరలకు అమ్ముతున్నారు. ఆ ద్వీపాల్లో మనపోకలకూ, కొబ్బరికీ మంచి గిరాకీ వున్నదన్న సంగతి నేను విన్నాను. అందు చేత, మనం కొంత పెట్టుబడి పెట్టి, పోకలూ, కొబ్బరీ, ఇతర సామగ్రీ కొని గండస, మాల్య ద్వీపాలకు వెళ్ళి వ్యాపారం చేద్దాం," అన్నాడు చంద్రశేఖరుడు.

"వ్యాపారం మనవల్ల అవుతుందా?" అన్నారు చంద్రశేఖరుడి మిత్రులిద్దరూ.



"ఏముంది? వ్యాపారంలో ఎదురు దెబ్బలు తినడం ప్రారంభమైంది. మా వ్యాపారపు తీరుతెన్నులు చూసి, ఒకళ్ళిద్దరూ ఈ వ్యాపారానికి కొత్తా? అంటూ నవ్వారు!" అని చెప్పారుసూర్యమిత్రుడూ,చందనమిత్రుడూ.

తరవాత వాళ్ళిద్దరూ, చంద్రశేఖరుడి వ్యాపారపు అనుభవాల గురించి ప్రశ్నించారు. అతడు తన మిత్రులేమైనా బాధ పడతారేమోనని సంశయిస్తూనే, వాళ్ళకు జరిగింది చెప్పాడు.

ఆ రోజు మధ్యాహ్నానికే చంద్రశేఖరుడు తెచ్చిన సరుకులో దాదాపు సగభాగం అమ్మకంజరిగిపోయింది. అందులో అతడు ఊహించిన దానికంటే అధిక లాభం రావడమేగాక, సింహళ, కాశ్మీర దేశాల నుంచి వచ్చిన వర్తకులతో పరిచయం కూడా లభించింది. వాళ్ళు, మర్నాడు తమతో విందుకు రావలసిందిగా అతణ్ణి ఆహ్వానించారు.

ఇది వింటూనే చంద్రశేఖరుడి మిత్రులిద్దరి ముఖాలూ నల్లబడ్డాయి.

ఆ తర్వాత, నాలుగైదు రోజుల్లోనే చంద్రశేఖరుడి వర్తక సరుకు మొత్తం అమ్ముడయి పోయింది. అప్పటికి చందనమిత్ర, సూర్యమిత్రులసరుకుసగంకూడాఅమ్ముడుపోక పోవడంవల్ల, చంద్రశేఖరుడు కల్పించుకుని వాళ్ళ సరుకు కూడా అమ్మి, లాభం సంపాయించి పెట్టాడు. అతడి సలహా మీద ముగ్గురు మిత్రులూ సుగంధ ద్రవ్యాలే కాక, ఇతర దేశాల వర్తకులు తెచ్చిన వింత వస్తువులూ, గృహాలంకరణ సామగ్రి కూడా మారు బేరానికి కొన్నారు.

ఈ విధంగా వ్యాపారం పూర్తికాగానే, ముగ్గురు మిత్రులూ తిరిగి ప్రతీహారనగరానికి బైలుదేరడానికి సన్నాహాలు చేసుకున్నారు.

రేపు ప్రయాణ మనగా ముగ్గురు మిత్రులూ కలిసి, గండసద్వీప ప్రజలు ఆరాధించే చెన్నకేశవస్వామి గుడికి వెళ్ళారు. ఎత్తయిన కొండ మీద వున్న ఆ గుడికి వెనకభాగాన, కొండను తాకుతూ గండకీ నది ప్రవహిస్తూంటుంది. స్వామి దర్శనం అయిన తర్వాత,కొండ అంచునస్వామిపూజ కోసం పెంచుతున్న ఉద్యానవనం చూసే



మిషమీద, చంద్రశేఖరుణ్ణి అక్కడికి తీసుకు వెళ్ళిన మిత్రులిద్దరూ, వెనుకపాటుగా అతణ్ణి గండకీనదిలోకి తోసేసి, వేగంగా అక్కడి నుంచి వెళ్ళి పోయారు.

వాళ్ళు, సత్రం చేరి చంద్రశేఖరుడి ధన కనక వస్తు సామగ్రి అంతా చెరిసగం వంచుకుని, కొద్దిరోజుల్లో ప్రతీహారనగరానికి తిరిగి వచ్చారు.

అక్కడ, కొడుకు కోసం వెయ్యికళ్ళతో ఎదురు చూస్తున్న చంద్రశేఖరుడి తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిన సూర్యమిత్రుడూ, చందనమిత్రుడూ వాళ్ళతో — చంద్రశేఖరుడు వ్యాపారం చెయ్యడం చేతకాక నష్టపోయాడనీ, అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడనీ చెప్పారు. ఆ దేశ చట్టం ప్రకారం అతడిదైన కొద్ది పాటి సరుకునూ, గండనరాజు స్వాధీనం చేసుకున్నాడనీ కళ్ళనీళ్ళు పెట్టుకుని అబద్ధాలు పలికి వాళ్ళను నమ్మించారు.

అయితే, వాస్తవంగా జరిగిందేమంటే — కొండమీది నుంచి కిందికి తోయబడ్డ చంద్రశేఖరుడు గండకీనదిలో గాక, కొండ దిగువున వున్న పెద్ద మర్రిచెట్టు కొమ్మల్లో పడ్డాడు. ఆ పాటుకు స్పృహతప్పిన అతడికి, సూర్యాస్తమయం కాబోతున్న సమయంలో తిరిగి స్పృహవచ్చింది.

వెంటనే అతడు, "రక్షించండి! రక్షించడి!" అంటూ కేకలు పెట్ట ప్రారంభించాడు.

ఆ సమయంలో, చెన్నకేశవస్వామి ఆలయ ధర్మకర్తలలో ఒకడైన మందారకుడి ఏకైక కుమార్తె స్వర్ణగౌరి చెలికత్తెలతో, ఆ ఉద్యానవనంలో వున్నది. చంద్రశేఖరుడి కేకలు విని కిందికి తొంగిచూసిన స్వర్ణగౌరి వెంటనే మనుషులను రప్పించి, మోకుల సాయంతోఅతణ్ణి పైకిలాగించింది.

పైకి వచ్చి, భూమిని తాకుతూనే మళ్ళీ స్పృహతప్పి పడిపోయాడు చంద్రశేఖరుడు. స్వర్ణగౌరి అతణ్ణి నౌకరుల చేత తన ఇంటికి తీసుకుపోయి శైత్యోపచారాలు చేయించసాగింది.

మందారకుడు, చంద్రశేఖరుణ్ణి చూసి కుమార్తెతో, "అమ్మా! ఇతను ప్రతీహార

నగరం నుంచి వచ్చిన వర్తకుడు; పేరు చంద్రశేఖరుడు. నేను ఇతడి దగ్గిర కొంత సరుకు కొని, ఇతడి తెలివితేటలకూ, నిజాయితీకి మెచ్చి బహుమతులు కూడా ఇచ్చాను!" అంటూ ఆశ్చర్యపోయాడు.

కొద్దిసేపట్లో స్పృహలోకి వచ్చిన చంద్రశేఖరుడు కూడా, గండసద్వీపంలో ప్రముఖ వర్తకుడైన మందారకుణ్ణి చూసి ఆశ్చర్యపడ్డాడు.

మందారకుడు ఆప్యాయంగా చంద్రశేఖరుణ్ణి పరామర్శించి, వివరాలు అడిగాడు. చంద్రశేఖరుడు మొదట్లో సంశయించినా, తర్వాత మొదటి నుంచీ జరిగినదేమీ దాచకుండా ఆయనకు చెప్పాడు.



అంతా విని మందారకుడు, "ఎంతటి మిత్రద్రోహం! ఇంకా ఆ ద్రోహు లిద్దరూ నగరంలోనే వుండి వుండవచ్చు. ఇప్పుడు రాజభటులను వెంటబెట్టుకుపోయి వాళ్ళను పట్టిబంధిస్తాను," అంటూ ఆవేశపడ్డాడు.

అయితే, చంద్రశేఖరుడు శాంతంగా, "అది సాధ్యమైనా, నా అభిప్రాయంలో చేయగూడని పని. మరొకటి, నన్ను చంపేందుకు ఇంత పథకం వేసినవాళ్ళు, ఇంకా నగరంలో వుండరు. బహుశా నా ధనం, మిగిలిన కొద్దిసరుకు తీసుకుని పారిపోయి వుంటారు," అన్నాడు.

మందారకుడు ఏదో సంశయం కలిగిన వాడిలా తలాడిస్తూ, "ఇంత జరిగినా నువ్వు, ఇకమీదట కూడా ఆ ద్రోహుల మిత్రుడిలాగే కొనసాగాలని ఆలోచిస్తున్నావా?" అని ప్రశ్నించాడు.

చంద్రశేఖరుడు నవ్వి, "అలాంటిదేం లేదు. వాళ్ళు చేసిన పనికి నా మనసు క్షోభిస్తున్నది. కాని, ఇప్పుడు వాళ్ళను పట్టుకుని నిందారోపణ చేయడమంటే, వీధిలో భిక్ష కోసం కాట్లాడుకునే బిచ్చగాళ్ళతంతు అవుతుంది. అది నా కిష్టం లేదు. నేను జ్ఞానిని కాదు; మేధావినని నావిశ్వాసం. అందుచేత వాళ్ళను జ్ఞానిలా క్షమించి వదిలెయ్యలేను. మేధావిలా పగ తీర్చుకుంటాను. మీకు నా మీద అభిమానం కలిగితే, నాకు కొద్ది పాటి పెట్టుబడి అప్పుగా ఇప్పించండి. మళ్ళీ



మందారకుడే మళ్ళీ నవ్వుతూ, "నిన్ను అల్లుడుగా చేసుకుని, ఎర్రఏగానీతో సహా, అంతా నీకే అప్పజెప్పమంటున్నది. కొడుకులు లేని నాకు కూడా నీవంటి అల్లుడు దొరికితే బాగుండుననే వున్నది! ఏమంటావు?" అని అడిగాడు.

దానికి చంద్రశేఖరుడు, "నా అభిప్రాయం చెప్పబోయే ముందు, ఒక్క విషయం! నా తల్లిదండ్రులూ, బంధు బలగమూ అంతా ప్రతీహారనగరంలో వున్నారు. వాళ్ళ మాట అట్లావుంచి, నాకు మాతృ దేశాభిమానం కూడా ఒకపాలు ఎక్కువే. అందువల్ల, నేను ఇక్కడ వుండి మీ వ్యాపారం చక్కబెట్టడమనేది జరగనిపని," అన్నాడు.

ఇందుకు మందారకుడు తృప్తిగా తలాడించి, "నీలోని ఈ స్వాభిమానాన్నే, మా అమ్మాయి ఇష్టపడిందన్న సంగతి మర్చిపోతున్నావు, అల్లుడూ! నీ ఇష్టప్రకారమే కానీ, మీ కోసం నేనే మీవెంట వస్తాను, కాదనవుగదా!" అన్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకే స్వర్ణగౌరికీ, చంద్రశేఖరుడికీ అత్యంత వైభవంగా వివాహం జరిగిపోయింది.

ఒక శుభదినాన చంద్రశేఖరుడు, భార్యనూ, మామగారినీ వెంటబెట్టుకుని బయలుదేరి ప్రతీహారనగరం చేరాడు.

ఊహించని విధంగా జరిగిన అతడి రాక, చంద్రశేఖరుడి తల్లిదండ్రులకు ఆనంద

వ్యాపారం చేసి, మీ అప్పు వడ్డీతో సహా తీరుస్తాను," అన్నాడు.

చంద్రశేఖరుడి మాటలకు మందారకుడు ముగ్ధుడై తలవూపుతూ ఏదో చెప్పబోయేంతలో, అక్కడే వుండి అంతా వింటున్న స్వర్ణగౌరి, "నాన్నా, ఒక్కమాట!" అంటూ తండ్రి చెయ్యి పట్టుకుని పక్కగదిలోకి తీసుకుపోయింది.

కొద్దిసేపటి తర్వాత, మందారకుడు ఒక్కడే తిరిగి వచ్చి, "మా అమ్మాయి, నీకు ఎర్రఏగానీ కూడా అప్పుగా ఇవ్వడానికి వీలులేదని పట్టుబడుతున్నదయ్యా!" అన్నాడు.

ఆ మాటలకు చంద్రశేఖరుడు ఏమీ చలించక మౌనంగా వుండిపోయాడు.

దాయకం కాగా, సూర్యమిత్ర, చందన మిత్రులకు పిడుగుపాటులా అయింది. పరిచయస్థులందరూ ఆశ్చర్యంగా చంద్రశేఖరుణ్ణి కలుసుకుని ప్రశ్నలు గుప్పించసాగారు.

అందరికీ చంద్రశేఖరుడు చెప్పిన సమాధానం ఒక్కటే: "దయచేసి నన్ను వివరాలడిగి ఇబ్బంది పెట్టకండి. ఒక్కమాట తప్ప నేనింకేమీ చెప్పలేను, అదేమిటంటే — ఈర్ష్యాపరులైనవారు కల్పించిన దారుణ ప్రమాదంనుంచి నన్నుతప్పించిన, మా కుల దైవం స్వయంభూస్వామికి సర్వదా కృతజ్ఞుణ్ణి!"

చంద్రశేఖరుడి మాటలు రకరకాల ఊహాగానాలకు దారి తీశాయి. "చంద్రశేఖరుడు మిగతా మిత్రులిద్దరి కంటే తెలివైనవాడు. లాభసాటి వ్యాపారం చేసివుంటాడు! దానికి ఈర్ష్యపడ్డ మిగతా ఇద్దరూ, అతణ్ణి చంపజూసివుంటారు! అందుకే చూశారా, చంద్రశేఖరుడి రాక పట్ల మిత్రులిద్దరూ అంత సంతోషంగా లేరు. చంద్రశేఖరుడు కూడా వారితో ముభావంగా వుంటున్నాడు!" అని చెప్పుకోసాగారు.

ఈ విధంగా, సూర్యమిత్ర, చంద్రమిత్రుల పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా తయారైంది.

అంతా గమనిస్తున్న మందారకుడు, ఒకనాడు చంద్రశేఖరుణ్ణి,"చంద్రశేఖరా! నువ్వు నీ స్నేహితులపై పగ తీర్చుకున్నట్టేనా?" అని ప్రశ్నించాడు.

అందుకు చంద్రశేఖరుడు, "లోకం చెడును, మంచికంటే తెలివిగా, నేర్పుగా గుర్తిస్తుంది, మామయ్యా! ఒకే ఒక సూక్ష్మమైన మాటతో, వాళ్ళిద్దరి దుర్మార్గాన్నీ లోకం చేత గుర్తింప జేశాను. ఇది పగ తీర్చు కోవడమే గదా!" అన్నాడు.

మందారకుడు సంతోషంగా, "అవును. నువ్వా మిత్రద్రోహుల్ని జ్ఞానిలా క్షమించలేననీ, మేధావిగా వాళ్ళపై పగతీర్చుకుంటాననీ అన్నావు. అన్నంత పనీ అతి సునాయాసంగా చేసినందుకు అభినందిస్తున్నాను," అన్నాడు.



## చందమామ కబుర్లు

### సుదీర్ఘమైన రోజు!

గత జూన్ 30 — జూలై 1 అర్ధరాత్రి సమయంలో మన మందరం గాఢ నిద్రలో ఉన్నప్పుడు ఢిల్లీలోని నేషనల్ లేబొరేటరీ శాస్త్రవేత్తలు మేల్కొని ఉన్నారు. ఆ ప్రయోగశాలలోని 'అటామిక్ క్లాక్'లో ఒక సెకండును సరిదిద్దడానికి, అలా వాళ్ళు మేలుకోవలసి వచ్చింది. వాళ్ళ లెక్కల ప్రకారం — భూ భ్రమణ వేగంలో ఆ రోజు ఒక సెకండు తగ్గు



తుంది. దానిని అప్పుడు సరిదిద్దక పోయినట్టయితే, 'ఆస్ట్రానామికల్ టైము'కూ మన చేతి గడియారాలలోని టైముకూ మరునాడు తేడా వచ్చేస్తుంది. ఇలాంటి సంఘటనే పదకొండేళ్ళ క్రితం అంటే — 1972 వ సం॥ జూన్ 30 వ తేదీ, ఒక సెకండు ఎక్కువయింది! అయితే, టీవీలో టైము చూసి వాచీలు సరిదిద్దుకునే మనం ఇవన్నీ గమనించం కదా!

### తప్పించుకున్న భూమి!

దాదాపు 6000 టన్నుల బరువుగల నక్షత్రాకార చిన్న గ్రహం ఒకటి మే 20 వ తేదీ గంటకు 48,000 మైళ్ళ వేగంతో భూమి కేసి దూసుకు రాసాగింది. భూమికి 90,000 మైళ్ళ దూరంలోకి రాగానే అది మరొక మార్గాన్ని పట్టి వెళ్ళిపోయింది. అదృష్ట వశాత్తు, దాని తాకిడి నుంచి భూమి తప్పించుకు



న్నది కాని, లేకుంటే పెద్ద నష్టం వాటిల్లి ఉండేదని అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థకు చెందిన ఇద్దరు శాస్త్ర వేత్తలు చెప్పారు. అంతరిక్షం లోని 'ఆస్టిరాయడ్స్'ను కనుగొనడమే వీళ్ళ పని!

### అంతరిక్షంలో నూతన విజయం!

అమెరికానుంచి 'ఎండవర్' అనే ఒక విలక్షణమైన వ్యోమనౌకను జూన్ 21వ తేదీ అంతరిక్షంలోకి వదిలారు. అది 56వ అంతరిక్షనౌక. అందులో ఆరుగురు వ్యోమగాములు వెళ్ళారు. వాళ్ళలో నలుగురు, బయలుదేరిన అయిదవ రోజు అంతరిక్షంలోకి అడుగు పెట్టి, అంతకు ఆరు నెలల క్రితం అంతరిక్షం చేరిన యూరోపియన్ రీసర్చ్ శాటలైట్ 'యురేకా'ను కనుగొని, దానికా 'ఎండవర్' ని కలిపి వచ్చారు. 'యురేకా' ఆరు నెలలుగా వివిధ పరిశోధనల ఫలితాలను సేకరించి పంపుతున్నది.



రాముడు అయోధ్యలో అతివైభవంగా పట్టాభిషిక్తుడైన తరవాత స్వయంగా రాజ్య పాలన విషయాల్లో శ్రద్ధ తీసుకోసాగాడు. అతను ఒకనాడు సుమంతుణ్ణి పిలిపించి, తనకు రాజ్యంలో ప్రజోపయోగ కార్యాలు భారీ ఎత్తున చేయాలని వున్నదనీ, అందుకు అవసరం అయిన ధనం సమకూర్చమనీ చెప్పాడు.

"గడచిన పధ్నాలుగేళ్ళుగా ప్రజలు, తాము కట్టవలసిన కప్పాలు కట్టటం మాని వేశారు, ప్రభూ!" అన్నాడు సుమంతుడు.

"సకాలంలో వర్షాలు పడక కరువు, కాట కాలు వచ్చి, పాపం ప్రజలు అవస్థల పాల య్యారన్నమాట!" అన్నాడు రాముడు ఎంతో బాధగా.

సుమంతుడు ఒక్క క్షణకాలం సంశ యిస్తూ వూరుకుని, "అలాంటి దేమీ లేదు, ప్రభూ! దేశం సస్యశ్యామలంగానే వున్నది. ప్రజలే మారి పోయారు. ధనికులైన వర్తకులు చెల్లించవలసిన పన్నులు ఎగ వేశారు. రైతులు కప్పాలు చెల్లించలేదు. సంపన్నులు మరికాస్త సంపన్నులయ్యారు; పేదలు మరింతగా పేదలైపోయారు," అన్నాడు.

"ఇలా ఎందుకు జరిగింది ? మరి భరతుడేం చేస్తున్నాడు?" అన్నాడు రాముడు చిరుకోపంగా

"ప్రభూ, ఆయన రాజ్యపాలన చేసిం దెప్పుడు! తమ పాదుకలను పూజిస్తూనే పధ్నాలుగేళ్ళూ గడిపేశాడు. అతని అమాయ

39. రామరాజ్యంలో హనుమంతుడి ముచ్చట్లు



కత్వాన్ని ఆసరాగా తీసుకుని, అతని ముందు తమ నామ సంకీర్తనం చేసి, చాలామందిబహుమానంగా ధనం పుచ్చుకు పోయారు.దేశపాలకుడుగా అయన కర్త వ్యాన్నిగుర్తుచేస్తే, 'పన్నులు కట్టని ప్రజలను ఎలాంటి బాధలకూ గురిచేయకండి. అందరూ మా అన్నగారైన శ్రీరాముని పొరులేగదా!' అని మాత్రం చెప్పి వూరు కున్నాడు. నేను, ప్రభువైన వారి ఆజ్ఞను శిరసావహించవలసిన వాణ్ణేగద," అన్నాడు సుమంతుడు.

రాముడికి సంగతంతా బాగా అర్థమై పోయి,"ఇంక నేనెలా రాజ్యపాలన చేసేది?" అంటూండగా లక్ష్మణుడు వచ్చాడు.

సుమంతుడు, లక్ష్మణుడికి కూడా ధనాగారం వట్టిపోయిన సంగతి వివరించి చెప్పాడు.

లక్ష్మణుడు కొంచెం సేపు ఆలోచించి, "అయితే, నా మాట మన్నించి ఒక పని చేయండి. ప్రభుత్వానికి పన్ను చెల్లించ వలసిన వారందరూ, తలా ఒక గుమ్మడి కాయంత బంగారం ఇచ్చుకుంటే చాలు నని రాజ్యమంటా చాటింపు వేయించండి. ఈ పద్ధతి వల్ల ప్రజలకు రాజ్యంలోని ఎలాంటి అన్యాయం జరగదని హామీ ఇస్తు న్నాను," అన్నాడు.

రాముడు ఇందుకు అంగీకరించాడు. ఆ రోజునే కోసలదేశం అంతటా చాటింపు వేయబడింది. పధ్నాలుగేళ్ళుగా పన్నులు ఎగవేసిన దేశప్రజలు, గుమ్మడి కాయంత బంగారం కాదు, ఏనుగు తలకాయంత బంగారం ఇవ్వమన్నా, ఇవ్వటానికి సిద్ధంగా వున్నారని లక్ష్మణుడికి తెలుసు. అయినా, ఎందుకైనా మంచిదని లక్ష్మణుడు హను మంతుణ్ణి పిలిచి, "నీవు ప్రజల మధ్య రహస్యంగా తిరిగి, ఈ చాటింపు విషయమై, వాళ్ళేమైనా అసంతృప్తి చెందారేమో తెలుసు కురా," అని చెప్పాడు.

హనుమంతుడు సూక్ష్మ రూపంతో ప్రజల మధ్యకు వెళ్ళి, వాళ్ళనుకునేదంతా విని తిరిగి వచ్చి, లక్ష్మణుడితో, "గుమ్మడి కాయంత బంగారం ఇవ్వటానికి ప్రజల్లో



ఎవరికీ అభ్యంతరం లేకపోగా, వాళ్ళు, భరతుడికన్న రాముడు ఇంకా అమాయకుడని మాట్లాడుకుంటున్నారు. ఇన్నేళ్ళుగా పన్నులు చెల్లించనందుకు, ఎన్నో గుమ్మడి కాయల ఎత్తు బంగారం చెల్లించమని అననందుకు వాళ్ళు చాలా సంతోషిస్తున్నారు," అని చెప్పాడు.

ఇది విన్న మీదట లక్ష్మణుడికి ఒక సందేహం కలిగింది. ప్రజల్లో కొందరైనా నీతిమంతులు, పాపభీతిగల ధర్మాత్ములు వుండక పోరు. అలాంటి వారికి ఏమాత్రం అన్యాయంజరక్కూడదు.గుమ్మడికాయంత బంగారం కన్న తక్కువ చెల్లించవలసిన వారెవరైనా వుంటే, అలాంటి వాళ్ళు బాధపడకూడదు!

లక్ష్మణుడు ఈ సమస్యకు పరిష్కారం ఏమిటా అని కొంచెంసేపు ఆలోచించి, ఒక ఉపాయం తోచగా, హనుమంతుణ్ణి వెంటబెట్టుకుని, అయోధ్యలో వున్న ధర్మదేవతాలయానికి వెళ్ళాడు. ఆలయంలో కొంతసేపుండి లక్ష్మణుడూ, అతిసూక్ష్మ రూపంతో హనుమంతుడూ, చిన్నగా మాట్లాడుకుంటూ బయిటికి వచ్చారు. ఆ సమయానికి సూర్యాస్తమానమై, బాగా చీకటి పడిపోయింది.

ఉదయం అవుతూనే రాజభవన ప్రాంగణంలో పెద్ద త్రాసు ఒకటి వేలాడ కట్టారు. ఒక సిబ్బెలో మామూలు గుమ్మడి కాయ ఉంచారు. ప్రజలంతా బంగారం మూటలు కట్టుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళల్లో ఒకడు ముందుగా తాను తెచ్చిన బంగారాన్ని రెండవ సిబ్బెలో వేశాడు. గుమ్మడికాయ వున్న సిబ్బె పైకి లేవలేదు. అతడు ఆశ్చర్యపోయి, తల గోక్కుంటూ ఇంటికి పరిగెత్తి, ఈసారి పెద్ద బంగారం మూటతో తిరిగి వచ్చి, దాన్నంతా సిబ్బెలో వేసిన తరవాత, తూకం సరిపోయింది. ఇది చూసిన ప్రజలు తమ తమ ఇళ్ళకు పోయి, మరికొంత బంగారం తీసుకుని వచ్చారు.

ప్రజల్లో ఒకడు భయపడుతూనే తన దగ్గిరున్న కొద్ది బంగారాన్ని త్రాసులో



వేశాడు. ఆ కొద్దిపాటి బంగారానికే కాటా కొమ్ము వాలి, అటువైపుగా మొగ్గు చూపింది. ఇది చూసిన అక్కడి ప్రజలు చాలా విడ్డూర పడ్డారు.

ఐతే మరికొందరు త్రాసులో బంగారం వేసిన తరవాత, అది సామాన్యమైన త్రాసు కాదనీ, ఏదో మహత్తుగలదనీ, న్యాయంగా ఎవరెంత చెల్లించాలో అంత తీసుకుంటుం దనీ గ్రహించి, ప్రజలు సంతోషంగా తాము చెల్లించవలసినదంతా చెల్లించారు. ఆవిధంగా చాలా బంగారం వసూలైంది. కోశాగారం నిండిపోయింది.

ఈ జరిగినది చూసి రాముడు ఆశ్చర్య పడ్డాడు. అతను లక్ష్మణుణ్ణీ, మంత్రి సుమంతుణ్ణీ తన రహస్య సమాలోచనా మందిరానికి పిలిపించాడు.

వాళ్ల వెనకగా హనుమంతుడు కూడా సూక్ష్మరూపంలో రహస్య మందిరం ప్రవే శించాడు.

"లక్ష్మణా, గుమ్మడికాయ బరువెంత వుంటుంది? అది మణుగులకొద్దీ బంగా రానికి సరిసమానంగా తూగింది! అంతేకాక ఒకే గుమ్మడికాయ రకరకాల బరువుల్ని చూపింది. మీరంతా కలిసి ప్రజల్ని మోసగిం చారు, ఔనా?" అని రాముడు గద్దించి అడిగాడు.

లక్ష్మణుడు వినయంగా చేతులు కట్టు కుని, "ఇందులో మోసం ఏమీ లేదు; అంతా ధర్మదేవత ఆదేశానుసారం జరిగింది. ఇందులో మన హనుమంతుడు పడిన శ్రమ కూడా కొంత లేకపోలేదు! త్రాసు మీది నడికొమ్ము పట్టుకుని హనుమంతుడు సూక్ష్మరూపంలో నిలబడ్డాడు. ధర్మదేవత చెప్పినంతమేరకు ఎటు ఎంత మొగ్గు చూపాలో, అటుపక్క త్రాసును పాదంతో నొక్కి పెడుతూ వచ్చాడు. ధర్మదేవత ఏమి చెప్పిందో అది ఒక్క హను మంతుడికే వినిపించింది. నేనూ, హను మంతుడూ ధర్మదేవతను అర్థించి, ఈ విధమైన సహాయాన్ని పొందాము. ప్రజల్లో ధర్మం తప్పక పన్నులు కట్టిన వారు కొద్దిమందే; ఎగవేసిన వాళ్ళు చాలా

మంది ఉన్నారు. ఇప్పుడు ప్రజల నుంచి ధనాగా రానికి న్యాయసమ్మతంగా రావలసిన పన్నులన్నీ ధర్మదేవత సహాయంతో వసూలు చేశాం. ఈ పథకం ఆలోచించేందుకు నేనూ, హనుమంతుడూ చాలా శ్రమపడ్డాం," అన్నాడు.



రాముడు ఏదో అనబోయేంతలో, "రామా! లక్ష్మణుడు చెప్పింది నిజం!" అంటూ ధర్మదేవత అశరీరవాణి వినిపించింది. ఆ వెంటనే హనుమంతుడు సూక్ష్మరూపం నుంచి నిజరూపం ధరించి, రాముడికి వీరాసనం వేసి, నమస్కరించాడు. రాముడు హనుమంతుణ్ణి ఎంతగానో శ్లాఘించాడు.

ఆ తరవాత కొద్దిరోజులకు రాముడు, కోసల నగర పౌరులందరికీ విందు భోజనం ఏర్పాటు చేశాడు. ఆ విందుకు అవసరం అయిన సామగ్రులు తెప్పించటంలోనూ, చలవ పందిళ్ళు వేయించటంలోనూ హనుమంతుడే ముందుండి, ఒక్క క్షణమైనా తీరిక లేకుండా పనిచేయసాగాడు.

సీత, హనుమంతుడు పడుతున్న శ్రమ గమనించింది. ఆమెకు అతడంటే పుత్ర వాత్సల్యం. లంకలో తన ఉనికిని మొదటగా తెలుసుకున్న వాడతను. ఆమె, హనుమంతుణ్ణి దగ్గిరకు పిలిచి, "నాయనా, హనుమా! ఉదయం నుంచీ క్షణం తీరిక లేకుండా శ్రమిస్తున్నావు. భోజన సమయం అయింది. అతిథులకు ఏలోటూ రాకుండా చూడవలసినవాడివి. అందువల్ల ముందుగా నువ్వు భోజనం చెయ్యటం బావుంటుంది," అన్నది.

హనుమంతుడు సరేనని, సీత వెనకగా వంటశాలలోకి వెళ్ళాడు. సీత అతడికి విస్తరివేసి వడ్డించటం ప్రారంభించింది. ఆమె వడ్డించిన పదార్థాలు హనుమంతుడు మరుక్షణం తినేస్తున్నాడు. ఇలా కొంత సేపు జరిగేసరికి వేలమంది పౌరుల కోసం వండిన అన్నం, కూరల గంగాళాలూ ఖాళీ అయిపోసాగినై. ఇది చూసి సీత ఆశ్చర్యపోతూ అక్కడి నుంచి పరుగు,



ఆ మరుక్షణం హనుమంతుడు తృప్తిగా త్రేన్చాడు. సీత అతడి ముందుకు వచ్చి, "ఏం నాయనా, ఇంకా వడ్డించ మంటావా?" అని అడిగింది.

"వద్దు తల్లీ, వద్దు! కడుపు నిండి పోయింది," అని హనుమంతుడు వంట శాల నుంచి బయిటికి వెళ్ళాడు.

ఆ తర్వాత సీత, అన్నపూర్ణాదేవిని ధ్యానించింది. ఆమె వంటకాలను ఎప్పటిలా గంగాళాలలో నింపింది. పౌరులకూ, వానరులకూ విందు ప్రారంభమయింది. వానరుల పంక్తిలో చివరగా కూర్చున్న ఒక పిల్లవానరుడు, ఊర వేసిన ఉస్తికాయను వింతగా చూస్తూ, వేళ్ళతో నొక్కేసరికి, ఉస్తికాయవిత్తు తుప్ మంటూ పైకెగిరింది.

పిల్లవానరుడు, "అట్టే! నీకే గంతు వెయ్యటం వచ్చనుకున్నావా? చూడు, నా ప్రతాపం!" అంటూ లేచి, పైకెగిరాడు. వాణ్ణి చూసి మరొక వానరుడు, మరి కాస్త ఎత్తు ఎగిరాడు. అది చూసి మరొక వానరుడు ఇంకొంచెం పైకెగిరాడు.

ఈ విధంగా వానర సమూహమంతా ఒకర్ని మించి మరొకరు అంతరిక్షంలోకి ఎగరసాగారు. అంగదుడూ, నీలుడూ, సుగ్రీవుడూ కూడా ఎగిరారు. హను మంతుడు మాత్రం, అలా ఎగరమని రాముడి అజ్ఞ ఏమో అనుకుని, లాంఛన ప్రాయంగా ఒక కుప్పిగంతు వేశాడు.

పరుగున రాముడి దగ్గిరకు పోయి, సంగతి చెప్పింది.

రాముడు నవ్వి, "హనుమంతు డెవరను కుంటున్నావు? పరమశివుడు, ఈ రూపంలో అవతరించాడు. అతణ్ణి ఎలా తృప్తిపరుస్తావో, అదంతా నీ ప్రజ్ఞ. నే చేయగలిగిందేమీ లేదు", అన్నాడు.

సీత వంటశాలకు తిరిగివచ్చి, హను మంతుడికి వెనకగా నిలబడి, మనసులో, "పరమేశ్వరా! నీ వెవరో నేను తెలుసు కున్నాను. ఇంతటితో నీ ఆకలికి స్వస్తి చెప్పకపోతే, మా పరువు దక్కదు, స్వామీ!" అనుకుని పంచాక్షరీ మంత్రాన్ని ముమ్మారు పఠించింది.

వానరుల కోలాహలం చూసి రాముడు అక్కడికివచ్చి, హనుమంతుడితో, "అందరూ అలా ఆకాశంలోకి ఎగురుతూంటే, నువ్వు చిన్న గంతు వేసి వూరుకున్నావేం?" అని అడిగాడు.

"రామా, ఇంతమంది మహావీరుల ముందు, నేనేపాటి?" అన్నాడు హనుమంతుడు వినయంగా.

అప్పుడు జాంబవంతుడు ముందుకు వచ్చి, "రామా! హనుమంతుడికి ఒకరు చెపితేనే గాని, అతడి శక్తిసామర్థ్యాలు తెలియవు," అన్నాడు.

రాముడు ఒక తెల్లతామరను హనుమంతుడికి ఇస్తూ, "మా వంశకర్త అయిన సూర్యభగవానుడికి, ఈ తెల్లతామరను అర్పించవలసి వున్నది. సూర్యుణ్ణి శ్వేత పద్మధరుడని పిలుస్తారు. దీన్ని ఆయనకు చేర్పగలవాడివి నువ్వొక్కడివే!" అన్నాడు.

హనుమంతుడు, "రామాజ్ఞ!" అంటూ తెల్లతామరను తీసుకుని, ఒక్క ఎగురున ఆకాశంలోకి పోయి, సూర్యుడి రథాన్ని పట్టుకుని, "గురుదేవా! రాముడు దీన్ని మీకు సమర్పించమన్నాడు," అంటూ తామర పువ్వును సూర్యుడి పాదాలముందు వుంచాడు.

సూర్యుడు, హనుమంతుణ్ణి, "చిరంజీవ!" అని దీవించి, తన చేతనున్న ఒక శ్వేత పద్మాన్ని హనుమంతుడికి ఇచ్చి, "దీన్ని రాముడికి ఇవ్వు. దీని ప్రభావం వల్ల రాముడి పాలనలో దేశం సుభిక్షంగా ఉంటుంది!" అన్నాడు.

ఆ శ్వేతపద్మం వాడదు. అది ఎక్కడ వుంటే అక్కడ వర్షాలు సక్రమంగా కురుస్తాయి. సస్యాలు సమృద్ధిగా పండుతాయి. ప్రజలకు ఎలాంటి వ్యాధులూ సోకవు. హనుమంతుడు, సూర్యుడి దగ్గిర సెలవు తీసుకుని, పద్మంతో తిరిగివచ్చి, దాన్ని రాముడికి ఇచ్చాడు.

రాముడు మహదానందంతో హనుమంతుణ్ణి కౌగలించుకున్నాడు. హనుమంతుడు, సీతారాములకు ప్రణమిల్లాడు. సీత, "నాయనా, నువ్వు చిరంజీవిగా వుండు!" అని దీవించింది.






# మూడో సాహసం

రంజనుడనే యువకుడికి సాహస కార్యాలంటే ఇష్టం. తనవంటి వీరుడు, ధైర్యశాలి మరెక్కడా వుండడని ఇంట్లో వాడు ప్రగల్భాలు పలుకుతూండేవాడు. రంజనుడి తాతకిది నచ్చక, "ఒరే, కంచు మోగినట్టు కనకం మోగదు! నీకు చేతనైనది చేసి చూపించాలి. నలుగురూ అది మెచ్చాలి. నీ గురించి నువ్వు చెప్పుకోవడం విశేషం కాదు," అన్నాడు.

తాత మాటలు రంజనుడికి రుచించలేదు. వాడు, "నావేమీ ప్రగల్భాలు కాదు. నాకు చేతనైన వీరకార్యాలు నలుగురికీ చెప్పందే ఎలా తెలుస్తుంది?" అన్నాడు.

"నీకింకా వయసుకు తగ్గ తెలివి అబ్బలేదు. అంతవరకూ నీ సామర్థ్యం వృథా! నీకే తెలివి వుంటే అడవిలోని అందమైన అమ్మాయిని పెళ్ళిచేసుకుని వస్తావు," అన్నాడు రంజనుడి తాత.

"ఆ అమ్మాయి ఎవరో, ఎక్కడుందో చెప్పు. పెళ్ళి చేసుకుని వచ్చి నా గొప్పతనం నిరూపించు కుంటాను," అన్నాడు రంజనుడు.

"ఇక్కడికి పది ఆమడల దూరంలో శ్రీమంతనగరం వుంది. ఆ నగరానికి ఆమడ దూరంలో ఒక అడవి వుంది. అందులో ఒక అందమైన అమ్మాయి వుంటున్నది. ఆమెను పెళ్ళిచేసుకుందామని చాలామంది సాహసవంతులు వెళ్ళారు. ఒక్కడూ సాధించలేకపోయాడు. చేతనైతే నువ్వా అమ్మాయిని తీసుకుని ఇంటికిరా!" అన్నాడు రంజనుడి తాత.

ఈ మాటలతో రంజనుడిలో పౌరుషం చెలరేగింది. వాడు వెంటనే శ్రీమంతనగరం వెళ్ళి అక్కడే ఒక పూటకూళ్ళ ఇంట్లో బస చేశాడు.

పూటకూళ్ళవ్వ, వాడు అడవిలో అమ్మాయి కోసం వచ్చాడని తెలుసుకుని, "బాబూ, అందంగా వున్నావు. చూపులకు మహా

జొన్నలగడ్డ రామలక్ష్మి



వాడికి కనిపించింది. తాతచెప్పిన అమ్మాయి ఆమే అయివుంటుందని వాడనుకుని, 'ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నువ్వెవరో ఇటువైపురా! నేను వెనక్కు తిరగలేను," అన్నదా స్త్రీ.

ఆ స్త్రీ జడ నిగనిగలాడుతూ ఎంతో పొడుగ్గా వున్నది. ఆ జడను బట్టే ఆమె అందాన్నూ హించుకుంటూ ముందుకు వెళ్ళిన రంజనుడు నివ్వెరపోయాడు. ఆమె శరీరం మహాశిల్పి రూపకల్పనలా వుంది. కానీ ముఖం వుండవలసిన చోటంతా శూన్యంగా వుంది. ఒక సున్నాకు జడవేసినట్టుందామె!

రంజనుడు ఆశ్చర్యపడుతున్నంతలో ఆమె, "ఆహాఁ, మగవాడింత అందంగా వుంటాడని వినలేదు, చూడలేదు. నీ వంటి అందగాణ్ణి పెళ్ళిచేసుకునే అదృష్టం నాకుందో లేదో! నన్నొక మాంత్రికుడు బంధించి ఇక్కడుంచాడు. నన్ను తనదిగా చేసుకోవాలనే సాహసవంతుడు మూడు సాహసాలు చేయాలి. అవి సామాన్యులకు సాధ్యపడేవి కాదు," అన్నదా యువతి.

"మూడు కాదు, ముప్పై సాహసాలు చేస్తాను. వేగిరం నీ కథ చెప్పు," అన్నాడు రంజనుడు.

"నేనొక రాజకుమార్తెను. నా అందం చూసి ఎక్కడెక్కడి రాజకుమారులూ నన్ను పెళ్ళాడాలనుకున్నారు. వాళ్ళందర్నీ స్వయంవరానికి పిలిస్తే, గొడవ కావచ్చని నా తండ్రి

వీరుడిలా కనబడుతున్నావు. ఇంతకూ నీకా అమ్మాయితో పనేమిటి? ఆమెను సాధించడానికి చాలా తెలివి కావాలి," అన్నది.

"తెలివి కన్న సాహసం మిన్న! నిజమైన సాహసి హరిహర బ్రహ్మదులసాయం కూడా కోరడు," అన్నాడు రంజనుడు.

ఆ మర్నాడు తెల్లవారుఝామునే అడవిలోకి బయల్దేరాడు రంజనుడు. అడవి దట్టంగా వుంది. అడుగడుగునా ముళ్ళ పొదలు, చెట్లకొమ్మలు అడ్డం వస్తున్నాయి. వాడు కత్తిని చేతబట్టి దారి చేసుకుంటూ ముందుకు వెళ్ళసాగాడు.

అలా కొంత దూరం వెళ్ళేసరికి ఒక చెట్టు కింద బండరాతి మీద కూర్చున్న స్త్రీ

భయపడి ఏదైనా పరీక్ష పెట్టాలను కున్నాడు. ఈ అడవిలో వుండే భస్మాక్షుడనే మాంత్రికుడిని సంప్రతించమని కొందరు నా తండ్రికి సలహా ఇచ్చారు. ఆయన ఇక్కడికి వచ్చాడు. భస్మాక్షుడు నన్ను చూస్తూనే మోహించి, నా తండ్రి నిక్కడి నుంచి తరిమేశాడు. వాడి మంత్రశక్తు లపారం. ఇష్టంలేని కన్యను బలవంతంగా పెళ్ళి చేసుకుంటే వాడి శక్తులు నశించి పోతాయట. అందువల్ల వాడు నన్నిక్కడిలా బంధించి వుంచి, రోజూ ఏదో ఒక సమ యంలో వచ్చి పెళ్ళిచేసుకోమని నన్ను బ్రతిమాలి వెళ్ళుతూంటాడు," అన్నదా యువతి.



"నీ శరీర లావణ్యం మూర్ఛ తెప్పించేలా వుంది. నీ పలుకు తియ్యగా వుంది. నాకు నీ రూపం కూడా చూడాలనుంది," అన్నాడు రంజనుడు కుతూహలంగా.

"అదిగో, చెట్టు కొమ్మకు ఒక భూతద్దం వేలాడు తున్నది. ఆ చెట్టెక్కాలంటే కొమ్మ కొమ్మకూ విషసర్పాలుంటాయి. ఇలా కింది నుంచి పైకెగిరి, ఆ భూతద్దాన్నందుకుంటే ఏ ప్రమాదమూ వుండదు. దానితో చూస్తే నీ కళ్ళకు నా ముఖం కనబడుతుంది. చేత నైతే ప్రయత్నించు," అన్నది యువతి చిన్నగా నవ్వుతూ.

ఆ మాట వింటూనే రంజనుడికి ఉత్సాహం వచ్చి, వాడు ముందుగా నేల మీద పిల్లి మొగ్గలు వేసి శరీరంలో వెచ్చదనాన్ని పుట్టించు కున్నాడు. తర్వాత కొంచెంగా పైకెగర సాగాడు. విచిత్రంగా వాడు పైకి ఎగిరినప్పుడెల్లా, ఆ కొమ్మ మరి కాస్త పైకి పోసాగింది. వాడు కింద వున్నప్పుడు మరి కాస్త కిందికి దిగుతున్నది.

ఆ కొమ్మలో మాంత్రికమాయ వున్నదని గ్రహించాడు రంజనుడు. వాడు కాసేపా కొమ్మనే పరీక్షగా చూసి కింద కూర్చున్నట్టు నటించాడు. కొమ్మ కిందికి వచ్చింది, రంజనుడు మెరుపువేగంతో ఎగిరి భూత ద్దాన్ని అందుకున్నాడు.

"శహభాష్ వీరయువకుడా!" అన్నదా యువతి.



ఇప్పుడు ఆమె ముఖం భూతద్దం ద్వారా రంజనుడికి కనిపిస్తున్నది. ఆమె సౌందర్యా నికి వాడు పరవశుడైపోతూ, "రాజకుమారీ! నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నేను చేయవ లసిన సాహసాలేమిటో చెప్పు," అని అడిగాడు.

" ఆ కనబడే కొండగుహలో భస్మాక్షుడు నిద్రపోతూంటాడు. గుహకు కాపలాగా కోరల భూతమొకటి వుంటుంది. ఆ భూతంతో యుద్ధంచేసి దాన్ని చంపి, దాని కోరలను చేజిక్కించు కోవాలి. ఆ కోరలతో పొడిస్తే తప్ప మాంత్రికుడికి చావులేదు!" అంటూ నిట్టూర్చిందా యువతి.

రంజనుడు వెంటనే బయలుదేరి కొండ గుహ చేరాడు. అక్కడ నిజంగానే ఒక కోరల భూతమున్నది. దానినోట్లో అటూఇటూ అడుగున్నర పొడవు కోరలు. రంజనుడిని చూస్తూనే అది పెడబొబ్బ పెట్టింది. రంజ నుడు ధైర్యం చిక్కబట్టుకుని కత్తి దూశాడు.

కోరల భూతం వాడిని చేత్తో పట్టుకుని పైకెత్తి, "నిన్ను నీ కత్తితో సహా గుటకాయ స్వాహా చేస్తాను!" అన్నది.

రంజనుడు శరవేగంతో కత్తిని కదిపి భూతం రెండు కోరల్నీ ఖండించాడు. భూతం పెద్దగా అరిచి నేల మీద పడి గిలగిలా కొట్టుకుని మరణించింది.

రంజనుడు, భూతం కోరలతో గుహలోకి వెళ్ళాడు. భస్మాక్షుడు నిశ్చింతగా గురక పెడుతూ నిద్రపోతున్నాడు. రంజనుడు వాడిని సమీపించి, రెండు చేతులతోనూ రెండుకోరలూ ఎత్తి వాడి గుండెల్లో పొడి చాడు. మెత్తటి మట్టిలోకి దిగినట్టుగా కోరలు రెండూ వాడి శరీరంలోకి దిగి పోయాయి. ఉన్నట్టుండి వాడి శరీరానికి నిప్పు రాజుకుంది. రంజనుడు చూస్తూండ గానే వాడు బూడిదైపోయాడు.

రంజనుడు ఎక్కడ లేని సంతోషంతో, రాజకుమారి దగ్గిరకుపరిగెత్తిపోయిజరిగింది చెప్పాడు. ఆమె అంతావిని, "శహభాష్, వీర యువకుడా! ఇప్పుడు నువ్వు రెండో సాహసం చెయ్యాలి. ఆ కనబడే చెట్ల గుంపు వెనక మొసళ్ళకొలను వుంది. మామూలు చెరువు నీళ్ళను తామరాకులు కప్పి వేసినట్టు, ఆ

కొలనును మొసళ్ళు కప్పి వేశాయి. ఆ కొలనుకు మధ్యలో ఒకే ఒక పుష్పముంది. ఆ పుష్పాన్ని తెచ్చి నాకు వాసన చూపిస్తే, భూతద్దం బాదరబందీ లేకుండా, నాముఖం లోని రూపురేఖలు స్పష్టంగా కనబడతాయి. నేనిక్కడి నుంచి బంధవిముక్తురాలినై కదల గలుగుతాను," అన్నది.

రంజనుడు ఆమె చెప్పిన వైపు వెళ్ళి మొసళ్ళకొలను చేరుకున్నాడు. మొసళ్ళన్నీ నోళ్ళు తెరిచి భయంకరంగా వున్నాయి. కొలను మధ్య ఎర్రగా మెరుస్తూ ఒక పుష్పం వున్నది. దాన్ని తేవడం ఎలా?

బాగా ఆలోచించగా రంజనుడి కొక ఉపాయం తట్టింది. వాడు చుట్టుపక్కల వున్నచెట్ల తీగలను నరికి బలమైన తాడుగా పేనాడు. తాడు ఒక కొసను కొలనుకివతల వున్న చెట్టు కొమ్మకు కట్టాడు. దాని రెండో కొసను తీసుకుని కొలను ఒడ్డు వెంటకొంత దూరం వెళ్ళి, తాడు కొసను మొదట కట్టిన చెట్టు కొమ్మకు ఎదురుగా వున్న చెట్టు కొమ్మకు బిగించాడు.

తర్వాత రంజనుడు, ఆ తాడును పట్టుకుని పాకుతూ కొలను మధ్యకు చేరి, తాడుపై తలకిందులుగా వేళ్ళాడుతూ మెరుపు వేగంతో పుష్పాన్ని తుంచి, తనను పట్టేందుకు నోళ్ళు తెరిచి ఎగిరే మొసళ్ళకు అందకుండా జర్రున తాడు మీదుగా పాకిపోయి ఒడ్డు చేరాడు.



వాడు తెచ్చియిచ్చిన పుష్పాన్ని వాసన చూస్తూనే రాజకుమారి చప్టాన బండరాతి మీది నుంచి లేచింది. ఇప్పుడు భూతద్దం లేకుండానే రంజనుడు ఆమె అతిలోక సౌందర్యాన్ని చూడగలిగాడు.

వాడు పెద్ద గొంతుతో, "ఆహాఁ, సాధించాను! సాధించాను! ఇప్పుడు నిన్ను పెళ్ళి చేసుకుని నాదాన్నిగా చేసుకుంటాను, రాజకుమారీ!" అన్నాడు పట్టరాని ఉత్సాహంతో.

అప్పుడాయువతి వికవికమంటూ నవ్వి, "ఎందుకలా ఒళ్ళూపై తెలియని ఉత్సాహంలో తలమునకలైపోతావు! నువ్వు చేయవలసిన మూడో సాహసం ఇంకా మిగిలి వుంది.అది నీ వల్ల కాదు. వెళ్ళిపో!" అన్నది.

"ఏమిటా మూడో సాహసం? త్వరగా చెప్పు," అన్నాడు రంజనుడు.

"నువ్వు చెయ్యవలసిన మూడోసాహసం, నన్నుపెళ్ళిచేసుకోవడమే!"అన్నదా యువతి.

"నిన్ను పెళ్ళి చేసుకునేందుకు సాహసాలు చేయాలి గానీ, నిన్ను పెళ్ళాడడమే ఎందుకు సాహసమవుతుంది? నువ్వొప్పుకుంటే అది నా అదృష్టమనుకుంటాను," అన్నాడు రంజనుడు.

"అయితే, నా అసలు రూపం చూడు! నేనొక పిశాచిని," అంటూ ఆ యువతి పిశాచిగా మారిపోయింది. ఆ వికృతరూపం చూస్తూనే రంజనుడికి గుండెజలదరించింది.

"నీ కిష్టమైతే మన పెళ్ళి జరుగుతుంది. లేదా నువ్వు మీ ఊళ్ళోవుంటావు," అన్నదా పిశాచయువతి.

మరుక్షణం రంజనుడు తన తాత వద్ద వున్నాడు. వాడు తాతతో,"మూడోసాహసం చేయలేక పోతేనేం! నేను చేసిన మొదటి రెండు సాహసాలూ మహాగొప్పవి. అవి సామాన్యులకు సాధ్యపడేవి కావు," అన్నాడు.

తాత నవ్వి,"ఆ మూడోసాహసం చేయలేనప్పుడు, నువ్వు చేసిన మొదటి రెండు సాహసాలూ వృథా కదా! ఇంకొకటి, ప్రమాదకరమైన అడవిలోకి నిన్ను పంపుతున్నానంటే, అక్కడ నీకే ప్రమాదమూ వుండదని నాకు తెలిసినట్టే కదా! నీలో తెలివి వుంటే నన్నడిగి, ఆ యువతి కథ మొత్తం తెలుసుకుని వుండేవాడివి. లేదా పూటకూళ్ళమ్మ నుంచయినా మరిన్ని వివరాలు సంపాయించేవాడివి. ఇవన్నీ నాకెలా తెలుసునని ఆశ్చర్యపోకు. ఇలాంటి అనుభవమే యువకుడుగా వుండగా నాక్కలిగింది. మీ నాన్న తెలివైనవాడు. అందువల్లేవాడు అడవికేసి వెళ్ళ లేదు. ఇన్నాళ్ళకు మళ్ళీ నీకు నా పోలిక వచ్చింది. ఇకమీదటనైనా, నాకులా బుద్ధి తెచ్చుకుని తెలివిగా మసులుకుంటే,జీవితంలో ఇటువంటి పనికిరాని సాహసాలు చేయనవసరంవుండదు!" అన్నాడు.

రంజనుడు సిగ్గుతో తల వంచుకుని తాతకు క్షమార్పణలు చెప్పుకున్నాడు.






ఒక దేశంలో ఒక ధనికుడుండేవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. వాడు పెరిగి పెద్దవాడయ్యాక తండ్రి వాడితో, "నాయనా, జీవితంలో అన్నింటికన్న విలువైనది స్నేహం. డబ్బు సంపాదించవచ్చు, కీర్తి సంపాదించవచ్చు, కాని స్నేహితులను సంపాదించటం చాలా కష్టం. అందుచేత నువ్వు ఎలాగైనా మంచి స్నేహితులను సంపాదించు!" అని సలహా ఇచ్చాడు.

అది మొదలు కొడుకు స్నేహితులను పోగుచెయ్యసాగాడు. త్వరలోనే వాడి చుట్టూ అనేకమంది యువకులు చేరారు. వారందరూ వాడితో ఎంతో స్నేహంగా ఉంటూ, తమకున్నదంతా త్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నట్టు కనపడ్డారు.

కొద్దికాలం గడిచాక తండ్రి కొడుకును పిలిచి, "నాయనా, నీకు స్నేహితులెవరైనా దొరికారా?" అని అడిగాడు.

"దొరికారు, నాన్నా! చాలామంది దొరికారు!" అన్నాడు కొడుకు.

తండ్రి ఆశ్చర్యంతో, "వాళ్లంతా నిజమైన స్నేహితులేనా?" అని అడిగాడు.

కొడుకు కొంచెం ఆలోచించి, "వాళ్లలో నిజమైన స్నేహితులు కనీసం పదిమంది ఉంటారు," అన్నాడు.

"నేను ఇన్నేళ్లు బతికాను గాని నాకున్నదల్లా ఒకటిన్నర స్నేహితులే! ఇంత కొద్ది కాలంలోనే నువ్వు పదిమంది నిజమైన స్నేహితులను సంపాదించావంటే నాకు నమ్మశక్యం కాకుండా ఉంది!" అన్నాడు తండ్రి అనుమానంగా.

కొడుకు తన స్నేహితులను వెనక వేసుకు వచ్చి, వాళ్లు తనకోసం ప్రాణాలనైనా ఇచ్చేస్తారని తండ్రితో వాదించాడు.

"ఆ సంగతి సులువుగానే ఋజువు చెయ్యవచ్చు! నువ్వు మాత్రం నేను చెప్పినట్టు

చెయ్యి. ఒక పందిని చంపి గోతంలో వేసి భుజాన పెట్టుకుని రహస్యంగా ఒక్కొక్క స్నేహితుడి దగ్గరికి వెళ్లు. నువ్వు కోపావేశంలో ఒక మనిషిని చంపినట్టు వారితో చెప్పు. ఈ సంగతి తెలిస్తే నీకు ఉరిశిక్ష తప్పదనీ నీకు సహాయం చేసిన వారిని కూడా కొరత వేసే అవకాశం ఉందనీ అను. ఆ తరవాత నిన్ను కాపాడటానికి, సహాయపడమని అడుగు, అప్పుడు ఏం జరిగేదీ చూస్తాం!" అన్నాడు తండ్రి.

కొడుకు అలాగే చేశాడు. అతను ఒక చచ్చిన పందిని గోతంలో పెట్టి భుజానవేసు కుని ఒక్కొక్క స్నేహితుడి దగ్గరికి వెళ్లి తండ్రి చెప్పిన ప్రకారం అన్నాడు. ఒక్కరూ అతనికి సహాయం చెయ్యలేదు.

" ఈ పరిస్థితిలో నేను నీకేమి సహాయం చెయ్యగలను? కొంపతీసి, ఈ శవంతో మా ఇంటికి వచ్చిన సంగతి మాత్రం ఎక్కడా బయటపెట్టకు. నిన్ను రక్షించలేకపోగా నేను కూడా ఇందులో చిక్కుకోవలిసి వస్తుంది!" అన్నాడొక స్నేహితుడు.

"నీ కోసం కొరతపడటానికి నేను సిద్ధం గానే ఉన్నాను, కాని అందువల్ల నీకేమీ ప్రయోజనం ఉండదు!" అన్నాడు మరొక స్నేహితుడు.

"నీకీ ప్రమాదం రావటం నా కెంతో విచారంగా ఉంది. నిన్ను ఈ జీవితంలో ఎన్నడూ మరిచిపోను," అన్నాడు ఇంకొక స్నేహితుడు.

"నిన్ను అధికారులు ఉరి తీశాక నీ శవాన్ని ఊరేగించి నీ ఉత్తరక్రియలు మహా



వైభవంగా జరిపిస్తాం!" అన్నాడు వేరొక స్నేహితుడు.

చేసేదిలేక కొడుకు విచారంగా తండ్రి వద్దకు తిరిగివచ్చి తన స్నేహితులు అన్న మాటలన్నీ చెప్పేశాడు.

అంతా విని తండ్రి తల ఆడించి, "నేను మొదటనే అనుకున్నాను. నాకు జీవితంలో ఒక్కటిన్నర స్నేహితులున్నారని చెప్పాను, జ్ఞాపకం ఉన్నదా? వారు నీకు ఏ విధంగా సహాయపడతారో అదికూడా, ఇప్పుడే పరీక్షించి చూద్దాం!" అన్నాడు.

తండ్రి సలహాప్రకారం కొడుకు గోతాన్ని భుజానవేసుకుని తన తండ్రికి గల అర్థ స్నేహితుడివద్దకు వెళ్లి తన స్నేహితులతో చెప్పినట్టే చెప్పాడు. ఆ స్నేహితుడు అంతా విని, "నేను నిన్నెరగను, కాని నీ తండ్రి నాకు స్నేహితుడు. ఆయన కోసం నీకు సహాయపడతాను," అన్నాడు.

తరవాత ఆయన పందిఉన్న గోతాన్ని రహస్యంగా రాత్రిపూట పెరట్లో పాతేసి, "ఇక నీకేమీ భయం ఉండదు. నిశ్చింతగా తిరుగు!" అన్నాడు.

ఈ సంగతి కొడుకుద్వారా తెలుసుకుని తండ్రి ఆ ఊరి తలారికి తన నౌకరుద్వారా ఒక వార్త పంపాడు. ఆ నౌకరు తలారి వద్దకు వెళ్ళి, "అయ్యా, మా యజమానిగారి కొడుకు ఒక మనిషిని చంపి గోతంలో పెట్టి ఫలానివారి ఇంటికి పట్టుకుపోయాడు. ఆ పెద్దమనిషి ఆ గోతాన్ని వేరెవరికీ తెలియకుండా తమ పెరట్లో పాతేయించి మా



యజమాని కొడుకును కాపాడాడు!" అని చెప్పాడు.

వెంటనే తలారి భటులను పంపి పెరడు తవ్వించగా గోతం దొరికింది.

ధనికుడి అర్ధస్నేహితుడు తలారితో, "అయ్యా, ఈ కుర్రవాడు మా ఇంటికి ఒక సారి వచ్చి తాను ఫలానా అని నాతో చెప్పిన మాట నిజమే. అంతకు పూర్వం గాని, ఆ తరవాత గాని నేనా కుర్రాణ్ణి చూడనేలేదు. నాకు తెలియకుండా అతనే నా పెరట్లో ఈ గోతాన్ని పాతివుంటాడు! నాకీ సంగతి ఏమీ తెలీదు!" అన్నాడు.

ఈ లోపుగా ధనికుడి కొడుకు తన తండ్రికి గల రెండో స్నేహితుడివద్దకు వెళ్ళి, "అయ్యా, నేను తొందరపడి ఒక మనిషిని హత్య చేశాను. మా తండ్రి స్నేహితుడొకాయన శవం గల గోతాన్ని తన పెరట్లో పాతిపెట్టి నన్ను కాపాడాడు. కాని ఈ సంగతి ఎలాగో బయటపడింది. నాకు ఉరిశిక్ష తప్పేటట్టు లేదు. ఏవిధంగానైనా నాకు సహాయపడ గలరా?" అని అడిగాడు.

ఈ మాట వింటూనే ధనికుడి స్నేహితుడు బయలుదేరి తలారి వద్దకు వెళ్ళి, "అయ్యా, ఫలాని కుర్రవాడిమీద హత్యా నేరం మోపినట్టు విన్నాను. అది నిజంగా అతను చేసిన హత్య కాదు. హంతకుడు నా కొడుకే! ఒకరు చేసిన హత్యకు ఇంకొకరు ఉరిపడటం భావ్యంకాదు. అందుచేత ఇష్టం లేకపోయినా నిజం చెప్పవలిసి వచ్చింది. నిర్దోషి అయిన ఆ కుర్రవాణ్ణి వదిలిపెట్టి, అసలు దోషి అయిన నా కొడుకును ఉరితీయించండి!" అన్నాడు.

ఈ మాట తెలియగానే ధనికుడు తన కొడుకుతో, "చూశావురా, నిజమైన స్నేహితుడు ఎలా ఆదుకుంటాడో! ప్రతివాళ్ళూ స్నేహితులని నమ్మకు!" అంటూ బయలు దేరాడు. ఆయన తలారివద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పి, " ఆ గోతంలో ఉన్నది మనిషి కాదు. పంది. కావాలంటే, గోతం విప్పి చూడండి," అన్నాడు.

తలారి వెంటనే గోతం విప్పిచూసి చాలా ఆశ్చర్యపోయాడు.



# ప్రకృతి వింతలు :



## గెరిల్లాలు!

మనుషుల్లాగా గెరిల్లాలు కూడా నిటారుగా నడవ గలవు. అయితే వాటి వెన్నెముక మనిషి వెన్నెముక లాగా వంగదు; మరీ నిటారుగా ఉంటుంది. కాబట్టి త్వరగా అలిసిపోయి నాలుగు కాళ్ళ మీదికి వంగి పోతాయి. చింపాంజీ, గిబ్బన్, ఉరాంగ్ఉటాన్ లాగా చూడడానికి తోక లేని కోతుల్లాగా ఉంటాయి గెరిల్లాలు. మనిషికి లాగే గెరిల్లాలకు 32 పళ్ళు ఉంటాయి. అయితే, పక్కదంతాలు మాత్రం పొడ వుగానూ, పదునుగానూ ఉంటాయి. ఐదు వేళ్ళు గల చేతులు మనిషి చేతుల్లాగే ఉంటాయి. కాని పాదాలు కూడా చేతుల్లాగే ఉంటాయి. చేత్తో పట్టు కునేట్టుగానే, కాళ్ళతోనూ గెరిల్లాలు చెట్టుకొమ్మలను పట్టుకోగలవు. లేచి నిలబడి చెట్ల అకులనూ, రెమ్మ లను తుంచి గాలిలోకి విసిరి, శత్రువులను ముఖ్యంగా వేటాడే వాళ్ళను బెదిరిస్తాయే తప్ప ఎదిరించి పోరా డవు. బలమైన రొమ్మును గట్టిగా కొట్టుకుంటూ మనుషుల్లాగే పెడబొబ్బలు పెడతాయి!

## చెట్టుకాదు గడ్డి!

చాలా ఎత్తుగా పెరిగే గడ్డి ఏదో తెలుసా? వెదురు! కొన్ని వెదుళ్ళు 35-36 మీటర్ల ఎత్తు ఎదుగు తాయి. అంతే కాదు; మరీ వేగంగానూ పెరుగు తాయి. 24 గంటలలో 90 సెం.మీ. కూడా పెరు గుతాయి. ఎత్తూ, రంగూ, ఆకారం మొదలైన వాటిని బట్టి చూస్తే వెదుళ్ళలో వెయ్యికి మించిన జాతులు ఉన్నాయి. కొన్ని జాతులు 60, 100, 120 సంవత్స రాల కొకసారి మాత్రమే పూస్తాయి. అయితే ఒక జాతికి చెందిన మొక్కలు ఎక్కడున్నాసరే ఒక్కసారి గానే అన్నీ పూస్తాయి. ఇండియా, జపాన్, చైనా దేశా లలో వెదుళ్ళు విరివిగా ఉన్నాయి.

## కొక్కి పాదాలు

మన ఇళ్ళలో బల్లులు గోడల మీదా, కప్పు కిందా తల్ల కిందులుగా వెళ్ళడం తరచూ చూస్తూ ఉంటాము. కప్పు కింద వెల్లకిలా నడుస్తునప్పటికీ అవి పడి పోవు. వాటిని చూస్తుంటే ఇది ఎలా సాధ్యమని ఆశ్చర్యం వేస్తుంది. బల్లులు గాజు కిటికీల మీద వెళ్ళేప్పుడు అవతలి వైపుకు వెళ్ళి చూస్తే వాటి పాదాలు కనిపిస్తాయి. పాదాలు అడుగు భాగంలో తిత్తులు ఉంటాయి. వాటి చుట్టూ అసంఖ్యాకంగా చిన్న చిన్న కొక్కాలు వెనక్కు తిరిగి ఉంటాయి. ఎంతటి నున్నటి ప్రదేశాన్నయినాసరే బల్లులు సునాయాసంగా పట్టుకోవడానికి ఈ కొక్కాలే ఉప యోగపడతాయి. బల్లులు ఒక్కొక్క పాదం తీసి వేసేప్పుడు పాదం అడుగు భాగంలోని తిత్తులు సంకోచించి మళ్ళీ వ్యాకోచిస్తూ ఉంటాయి.



Say, "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!





SUPER RUBBER

It's time to go back to school again. Time for text books. Time for games. Time to meet old friends. And make new ones. Time to start studying again. Because there's so much to learn about the world around you.

From all of us here at Chandamama, have a great year in school. And remember to tell us what you've learnt everyday, when you come home from school !

THE
CHANDAMAMA
COLLECTION

ARTIG1246

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1993 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



P.R. Murthy

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *ఆగస్టుఈ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ప్రాణాధారం! రెండవ ఫోటో : ప్రకృతి వరం!!

పంపినవారు : సిరిసిల్లా రశీద శిక్షక్, Z.P. హైస్కూల్, దోన్కల్ - 503 311,

నిజామాబాద్ జిల్లా (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**



# ఎకోతో ముఖవైఖరులను తయారు చేయండి!

ఎకో స్కెచ్ పెన్నులతో క్రొత్త ముఖములను తయారు చేయడం ఎంతో సులువు మాత్రమే కాకుండా అది ఎంతో ఉల్లాసవంతమైన వేడుక కూడాను!

ఎకో అనేక ప్రకాశవంతమైన రంగులలో, 12, 24, మరియు 30 పెన్నులుగల ప్యాక్‌లలో లభిస్తుంది.

అయితే అన్నింటికన్నా అత్యుత్తమమైన విషయమేమిటంటే, ఎకో నీటి-ఆధారముతో కూడినదై యుండి మరియు విషపూరితము- కానిది. కనుక, ఉపయోగించుకోడానికి అది మీకు సంపూర్ణముగా సురక్షితమైనదిగా ఉంటుంది.

ఒక్కసారి ఆలోచించు అదంటే అమ్మ ఎంతగా ఇష్టపడుతుందో.

గెలుచుకొండి వేలకొలది బహుమతులు!




Ekco®

ఎకో అంటే అంతులేని వినోదం!



Karishma/SW/6/2016 TL A

పాలకడలంతా
చిలికి తెచ్చిన ఆశ



nutrine Aasay







ప్రేమ నింపి న్యూట్రిన్ పంచి ఇచ్చు ఆశ